శ్రీ

# ఆంధ్రకుమారసంభవము.

## ప్రథమభాగము.

---

## ఆదిపూడిసోమనాథరాయ

ప్రణీతము.

పద్యకావ్యము

సంస్కృత కుమారసంభవసమేతము.

మొదటికూర్పు 1000.



పిఠాపురము.

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు
ముద్రితము.

1914

అంచెకూలికాక]  కాపీరైటు రిజిస్టర్డు.  [దీనివెల రు 0-8-0

# విన్నపము.



దీనిని రచియించుటకు నన్నుఁ బురికొల్పినవాఁడు పరమేశ్వరుఁడు. దీనిలోని గుణదోషములకన్నిఁటికి నాతఁడే యుత్తరవాది.

ఈకావ్యమునందలి కొన్నిభాగములను నాకుఁ బాఠముసెప్పిన బ్ర॥శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారికిని, దీనినిద్వరలోఁ జక్కఁగ ముద్రించియిచ్చిన శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాశాలాధికారులకును నేను గృతజ్ఞతాపూర్వక వందనము లర్పించు చున్నాఁడను.

ఇట్లు విన్నవించు

సజ్జనసేవకుఁడు

ఆదిపూడి సోమనాథరావు.

పిఠాపురము.

25-3-14



# అంకితము.



గీ. శ్రీల కిర వయి న న్నేలు ◆ నేలిక వయి
యొసఁగునీదయఁ దెవిగించి ◆ యిచ్చెదఁ గొనుము
కాళిదాసకృతం బయి ◆ క్రాలుచుండు
భవ్య మైనకుమారసం ◆ భవము దేవ !



శ్రీ

# కుమారసంభవమ్.



## ప్రథమస్సర్గః.



అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః
పూర్వాపరౌ వారినిధీ విగాహ్య స్థితః పృథివ్యా ఇవ మానదణ్డః॥ 1
యం సర్వశైలాః పరికల్ప్య వత్సం మేరౌ స్థితే దోగ్ధరి దోహదక్షే
భాస్వన్తి రత్నాని మహౌషధీశ్చ పృథూపదిష్టాం దుదుహు ర్ధరిత్రీమ్॥ 2
అనన్తరత్నప్రభవస్య యస్య హిమం న సౌభాగ్యవిలోపి జాతమ్
ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీన్దోః కిరణే ష్వివాఙ్కః॥ 3
య శ్చాప్సరోవిభ్రమమణ్డనానాం సంపాదయిత్రీం శిఖరై ర్బిభర్తి
వలాహకచ్ఛేదవిభక్తరాగా మకాలసంధ్యా మివ ధాతుమత్తామ్॥ 4
ఆమేఖలం సఞ్చరతాం ఘనానాం ఛాయా మధస్సానుగతాం నిషేవ్య
ఉద్వేజితా వృష్టిభి రాశ్రయన్తే శృఙ్గాణి యస్యాతపవన్తి సిద్ధాః॥ 5
పదం తుషారస్రుతిధౌతరక్తం యస్మి న్నదృష్ట్వాఽపి హతద్విపానాం
విదన్తి మార్గం నఖరన్ధ్రముక్తై ర్ముక్తాఫలైః కేసరిణాం కిరాతాః॥ 6
న్యస్తాక్షరా ధాతురసేన యత్ర భూర్జత్వచః కుఞ్జరబిన్దుశోణాః
వ్రజన్తి విద్యాధరసున్దరీణా మనఙ్గలేఖక్రియ యోపయోగమ్॥ 7
యః పూరయన్ కీచకరన్ధ్రభాగాన్ దరీముఖోత్థేన సమీరణేన
ఉద్గాస్యతా మిచ్ఛతి కిన్నరాణాం తానప్రదాయిత్వమి వోపగన్తుమ్॥ 8
కపోలకణ్డూః కరిభి ర్వినేతుం విఘట్టితానాం సరళద్రుమాణాం
యత్ర స్రుతక్షీరతయా ప్రసూతః సానూని గన్ధ స్సురభీకరోతి॥ 9



శ్రీ

# కుమారసంభవము.



## ప్రథమాశ్వాసము.



### గీతములు.

పూర్వపశ్చిమవార్ధుల ♦ ముట్టి భువికిఁ, గొలఁతకఱ్ఱయి యనునట్లు ♦ పొలుచువాఁడు
దేవతామూర్తి యుత్తర ♦ దిక్కునందుఁ, గాఁపిలు హిమవంతుఁ డనునగ ♦ రాజమౌళి. 1
అతని వత్సంబుగ నొనర్చి ♦ యద్రులెల్లఁ, బిదుకఁ గుశలుని మేరువున్ ♦ బెట్టి పిదికెఁ
బృథువు దెలియంగఁ జెప్పధ ♦ రిత్రినుండి, యోషధులఁ గాంతులొలుకుర ♦ త్నౌఘములను.
అమితమణు లీనునాతని ♦ యందమునకు, లోపమును మంచు గొల్పఁగా ♦ నోప దయ్యె
నిందుకిరణాళి నణఁగెడు ♦ కందుకరణి, నణఁగుఁగద కుందు సద్గుణ ♦ గణములందు. 3
అభ్రశకలమ్ములకు రాగ ♦ మబ్బఁజేసి, సంజగాఁ దోఁపనిచ్చి య ♦ సంధ్యవేళ
నచ్చరల విభ్రమకలాప ♦ మందఁగొలుపు, ధాతువులఁ దాల్చుశృంగసం ♦ తతుల నతఁడు.
అతనిమధ్యప్రదేశమ్ము ♦ నంటి తిరుగు, మొగిలునీడలఁ గ్రీనెత్త ♦ ముల వసించి
యెంతయును వాన వేధింప ♦ నెండ దగులు, శిఖరములఁ జేరుచుందురు ♦ సిద్ధవరులు. 5
సింధురమ్ములఁ జంపిన ♦ సింహతతుల, చరణరక్తంబు మంచుచేఁ ♦ జెఱిగిపోవ
వానిజాడల నఖరంధ్ర ♦ పాళినుండి, రాలుముత్యాలఁ గాంతురి కి ♦ రాతు లచట. 6
దంతిపాడలట్టు లెఱ్ఱని ♦ ధాతురసపు, వర్ణములు గలభూర్జంపుఁ ♦ బట్ట లచట
వెలయువిద్యాధరస్త్రీలు ♦ ప్రియులఁ గూర్చి, వ్రాసినయనంగలేఖ లై ♦ వఱలుచుండు.
దరులముఖమునఁ దరలువా ♦ తమ్ముచేత, వేణురంధ్రాలి నూఁదుచు ♦ వేడ్క నతఁడు
గట్టిగాఁ బాడుకిన్నర ♦ గానములకుఁ, దానమును గూర్పఁ గోరుచం ♦ దమున నుండు.
ద్విరదములు దీఁట వోవంగ ♦ దేవదారు, వృక్షతతులకుఁ జెక్కిళ్లు ♦ వెట్టి రాయఁ
గారుకమ్మనిపాలచేఁ ♦ గలుగుచుండుఁ, జారుపరిమళ మచ్చటి ♦ చఱియలకును. 9

వనేచరాణాం వనితాసఖానాం దరీగృహోత్సఙ్గనిషక్తభాసః
భవన్తి యత్రౌషధయో రజన్యామతైలపూరాః సురతప్రదీపాః॥ 10

ఉద్వేజయత్యఙ్గులిపార్ష్ణిభాగాన్ మార్గే శిలీభూతహిమేపి యత్ర
న దుర్వహశ్రోణిపయోధరార్తా భిన్దన్తి మన్దాం గతిమశ్వముఖ్యః॥ 11

దివాకరాద్రక్షతి యో గుహాసు లీనం దివాభీతమివాన్ధకారమ్,
క్షుద్రేపి నూనం శరణం ప్రపన్నే మమత్వముచ్చైశ్శిరసాం సతీవ॥ 12

లాఙ్గూలవిక్షేపవిసర్పిశోభైరితస్తతశ్చన్ద్రమరీచిగౌరైః
యస్యార్థయుక్తం గిరిరాజశబ్దం కుర్వన్తి వాలవ్యజనైశ్చమర్యః॥ 13

యత్రాంశుకాక్షేపవిలజ్జితానాం యదృచ్ఛయా కింపురుషాఙ్గనానామ్
దరీగృహద్వారవిలమ్బిబిమ్బాస్తిరస్కరిణ్యో జలదా భవన్తి॥ 14

భాగీరథీనిర్ఝరశీకరాణాం వోఢా ముహుః కమ్పితదేవదారుః
యద్వాయురన్విష్టమృగైః కిరాతైరాసేవ్యతే భిన్నశిఖణ్డిబర్హః॥ 15

సప్తర్షిహస్తావచితావశేషాణ్యధో వివస్వాన్ పరివర్తమానః
పద్మాని యస్యాగ్రసరోరుహాణి ప్రబోధయత్యూర్ధ్వముఖైర్మయూఖైః॥ 16

యజ్ఞాఙ్గయోనిత్వమవేక్ష్య యస్య సారం ధరిత్రీధరణక్షమం చ
ప్రజాపతిః కల్పితయజ్ఞభాగం శైలాధిపత్యం స్వయమన్వతిష్ఠత్॥ 17

స మానసీం మేరుసఖః పితౄణాం కన్యాం కులస్య స్థితయే స్థితిజ్ఞః
మేనాం మునీనామపి మాననీయామాత్మానురూపాం విధినోపయేమే॥ 18

కాలక్రమేణాథ తయోః ప్రవృత్తే స్వరూపయోగ్యే సురతప్రసఙ్గే
మనోరమం యౌవనముద్వహన్త్యా గర్భోభవద్భూధరరాజపత్న్యాః॥ 19

అసూత సా నాగవధూపభోగ్యం మైనాకమమ్భోనిధిబద్ధసఖ్యమ్
క్రుద్ధేపి పక్షచ్ఛిది వృత్రశత్రావవేదనాజ్ఞం కులిశక్షతానామ్॥ 20

అథావమానేన పితుః ప్రయుక్తా దక్షస్య కన్యా భవపూర్వపత్నీ
సతీ సతీ యోగవిసృష్టదేహా తాం జన్మనే శైలవధూం ప్రపేదే॥ 21

సా భూధరాణామధిపేన తస్యాం సమాధిమత్యాముదపాది భవ్యా
సమ్యక్ప్రయోగాదపరిక్షతాయాం నీతావివోత్సాహగుణేన సంపత్॥ 22

గుహ లనెడునిండ్లవెలుతురుఁ ◆ గొలుపునచటి, యోషధులు రాత్రిసతులతో ◆ నొప్పుచుండు
బోయలకు మన్మథక్రీడ ◆ సాయపడెడు, చమురులేకయె వెల్గుదీ ◆ పములగములు. 10

మార్గమున గడ్డకట్టిన ◆ మంచుచేత, మడమలకు వ్రేళ్లకును బాధ ◆ పొడముచున్నఁ
గటికుచభరమ్ముచేఁ బీడఁ ◆ గాంచుచున్న, మందగతిఁ గిన్నరస్త్రీలు ◆ మానరచట. 11

తా దివాభీతమట్టులు ◆ తమము వచ్చి, దరులఁ జొరఁ గాచె నతఁడహ ◆ స్కరునినుండి
గొప్పవారలు దముఁ జేరు ◆ క్షుద్రునందు, మాన్యునం దెట్లో యట్లభి ◆ మానమిడరె. 12

వాలముల వీచి చమరీమృ ◆ గాళి యచట, నటునిటును గాంతిఁ జల్లుచు ◆ నిందుకళల
ఛాయఁ దెల్లని వాల ◆ చామరముల, సల్పుఁ దద్గిరిరాజాఖ్య ◆ సార్థకముగ. 13

చేలముల నాథు లెడలింప ◆ సిగ్గుగొన్న, కిన్నరాంగనలకు గుహా ◆ గృహముఖముల
వ్రేలుచుండెడుతోయద ◆ బింబపాళి, కాన్పులఁ దెరలౌచు నచట నా ◆ కస్మికముగ. 14

అమలగంగాఝురీశీక ◆ రములఁ దాల్చి, సారె కాడించి ఘనదేవ ◆ దారుతరుల
నెమ్మి పురివిప్పఁ జేయువా ◆ తమ్ము నచట, మృగయు లెంతయు సేవించి ◆ మించుచుంద్రు.

అతనిపై నుండు కొలఁకుల ◆ యందుఁ బుట్టి, మీఁదిసప్తర్షులును గోయ ◆ మిగిలియున్న
పద్మములఁ గ్రిందిసూర్యుండు ◆ పైకిఁ బర్వి, మించుకిరణాళిచే నల ◆ రించుచుండు. 16

యజ్ఞసాధనహేతువై ◆ యలరునంచు, భూమిని ధరించుబలముచేఁ ◆ బొలుచునంచు
నెఱిఁగియిడెయజ్ఞభాగమ్ము ◆ గిరులమీఁది, యాధిపత్యమ్ము స్వయముగా ◆ నతనికజుఁడు.

మేరుసఖుఁ డాస్థితిజ్ఞుఁడు ◆ మేన యనెడు, నమలమునిమాన్యఁ బితృదేవ ◆ తాత్మజను
నన్వయము నిల్ప ననురూప ◆ యైనకన్య, విధి విధించినవిధమునఁ ◆ బెండ్లియాడె. 18

కొంతకాలము గడవఁగా ◆ నంత వారి, యందమునకర్హమైనయ ◆ నంగకేళి
మించ నెఱజవ్వనమ్ము వ ◆ హించి యుండు, గట్టుఱేనిపత్నికి ◆ గర్భ మొదవె. 19

ఆమె గనె నబ్ధిమైత్రిచే ◆ నలరువానిఁ, బక్షవిచ్ఛేది వజ్రి కో ◆ పంబుగొన్న
నశనిహతివేదన నెఱుంగ ◆ నట్టివాని, నాగకాంతోపభోగ్యు మై ◆ నాకనాము. 20

అంత శివుపూర్వపత్ని ద ◆ క్షాత్మజాత, సతి సతీదేవి జనకావ ◆ మతినియుక్తి
యోగగతిచేత దేహవి ◆ యోగ మొంది, జననమందంగ హిమవంతు ◆ సతిని జేరె. 21

శైలపతిచేత నియత యా ◆ సాధ్వియందు, జనన మాసతి యొందె; ను ◆ త్సాహశక్తి
చేత నడిపింపఁ జెడిపోని ◆ నీతియందు, జననమొందెడుజయలక్ష్మి ◆ చందమునను. 22

ప్రసన్నదిక్ పాంసువివిక్తవాతం శఙ్ఖస్వనానన్తరపుష్పవృష్టి
శరీరిణాం స్థావరజఙ్గమానాం సుఖాయ తజ్జన్మదినం బభూవ॥ 23

తయా దుహిత్రా సుతరాం చకాసే స్ఫురత్ప్రభామణ్డలయా సవిత్రీ
విదూరభూమి ర్నవమేఘశబ్దా దుద్భిన్నయా రత్నశలాక యేవ॥ 24

దినే దినే సా పరివర్ధమానా లబ్ధోదయా చాన్ద్రమసీవ లేఖా
పుపోష లావణ్యమయా న్విశేషాన్ జ్యోత్స్నాన్తరాణీవ కళాన్తరాణి॥ 25

తాం పార్వతీ త్యాభిజనేన నామ్నా బన్ధుప్రియాం బన్ధుజనో జుహావ,
ఉ మేతి మాత్రా తపసో నిషిద్ధా పశ్చాదుమాఖ్యాం సుముఖీ జగామ॥ 26

మహీభృతః పుత్రవతోఽపి దృష్టిస్తస్మి న్నపత్యే న జగామ తృప్తిమ్,
అనన్తపుష్పస్య మధో ర్హి చూతే ద్విరేఫమాలా సవిశేషసఙ్గా॥ 27

ప్రభామహత్యా శిఖయేవ దీప, స్త్రిమార్గయేవ త్రిదివస్య మార్గః,
సంస్కారవత్యేవ గిరా మనీషీ, తయా స పూతశ్చ విభూషితశ్చ॥ 28

మన్దాకినీ సైకతవేదికాభి స్సా కన్దుకైః కృత్రిమపుత్రికైశ్చ
రేమే ముహుర్మధ్యగతా సఖీనాం క్రీడారసం నిర్విశతీవ బాల్యే॥ 29

తాం హంస మాలా శ్శరదీవ గఙ్గాం, మహౌషధిం నక్తమి వాత్మభాసః,
స్థిరోపదేశా ముపదేశకాలే ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః॥ 30

అసంభృతం మణ్డన మఙ్గయష్టే రనాసవాఖ్యం కరణం మదస్య
కామస్య పుష్పవ్యతిరిక్త మస్త్రం బాల్యాత్పరం సాథ వయః ప్రపేదే॥ 31

ఉన్మీలితం తూలికయేవ చిత్రం, సూర్యాంశుభిర్భిన్నమి వారవిన్దం,
బభూవ తస్యా శ్చతురస్రశోభి వపు ర్విభక్తం నవయౌవనేన॥ 32

అభ్యున్నతాఙ్గుష్ఠనఖప్రభాభి ర్నిక్షేపణా ద్రాగమి వోద్గిరన్తౌ
ఆజహ్రతు స్తచ్చరణౌ పృథివ్యాం స్థలారవిన్ద శ్రియ మవ్యవస్థామ్॥ 33

సా రాజహంసై రివ సన్నతాఙ్గీ గతేషు లీలాఞ్చితవిక్రమేషు
వ్యనీయత ప్రత్యుపదేశలుబ్ధై రాదిత్సుభి ర్నూపురశిఞ్జితాని॥ 34

వృత్తానుపూర్వే చ న చాతిదీర్ఘే జఙ్ఘే శుభే సృష్టవత స్తదీయే
శేషాఙ్గనిర్మాణవిధౌ విధాతు ర్లావణ్య ముత్పాద్య ఇ వాస యత్నః॥ 35

రజ మెడలి గాలి వీచెను ♦ గ్రాలె దిశలు, శంఖములు మ్రోసెఁ బుష్పవ ♦ ర్షములు గురిసె
స్థిరచరప్రాణులకు నెల్ల ♦ హరుస మొదవె, నమ్మహాదేవి పుట్టిన ♦ యవసరమున. 23

అధిక తేజంబుచే నొప్పు ♦ నాసుపుత్రి, వలన నామాత యెంతయు ♦ వఱలుచుండె
నవ్యగర్జ జనించర ♦ త్నంపుమొలక, వలన వైదూర్యదేశంబు ♦ వఱలునట్లు. 24

పుట్టి నానాఁట వర్ధిల్లి ♦ పొలుచు బాల, వెన్నెలను గూడి యుండు వే ♦ ర్వేఱుకళలఁ
బెంచు శశిరేఖవిధమునఁ ♦ బెంచుచుండె, నమలలావణ్యమయము లౌ ♦ నవయవముల. 25

బాంధవప్రియ నామెను ♦ బంధుజనులు, వంశమును బట్టి పిల్చిరి ♦ పార్వతి యని
తపము సల్ప నుమాయని ♦ తల్లి యాఁపెఁ, గాన నుమయను నామంబు ♦ గలిగెఁ బిదప. 26

అద్రిపతి కెందఱో పిల్ల ♦ లమరియున్నఁ, దనియవయ్యెను జూడుకొ లా ♦ తనయయందు
మధువునకు లెక్కలేనిసు ♦ మమ్ము లున్న, భ్రమరముల బారు చూతపు ♦ ష్పము నెకోరు

దీప్త మైనట్టిజ్వాలచే ♦ దీపమట్లు, దేవనదిచేత సురపురి ♦ త్రోవమాడ్కి
శుద్ధ మావాక్కుచేతను ♦ సూరివోలె, నామెచేఁ బూతభూషితుఁ ♦ డయ్యె నతఁడు. 28

ఆటరుచి నెల్లఁ జూడనో ♦ యనఁగ బాల, చెలఁగి బొమ్మలతోడను ♦ బెండ్లతోడ
దేవనదిచెంత నిసుకవే ♦ దికలతోడ, సారెసారెకు నాడెను ♦ సఖులతోడ. 29

అంచపిండు శరద్గంగ ♦ నందుకరణి, నోషధిని రాత్రిఁ దత్కాంతి ♦ యొందినట్లు
పూర్వజన్మపువిద్యలు ♦ పొందె నుమను, నేర్చుతఱిఁ దొల్లిదిరముగా ♦ నేర్చియుంట.

దేహయష్టికిఁ బెట్టని ♦ దివ్యభూష, యాసవము సేరుఁగొననియు ♦ ల్లాసకారి
యలరు కానియనంగుని ♦ యస్త్ర మైన, బాల్యమావలిప్రాయమున్ ♦ బడసె నామె. 31

చెన్ను తూలికచేఁ గన్న ♦ చిత్రమట్లు, భానుకిరణాళి నలరిన ♦ పద్మమట్లు
భవ్యనవయావనము చేత ♦ వ్యక్త మైన, సుదతి నెమ్మేను సర్వాంగ ♦ శోభఁ గాంచె. 32

ఉన్నతాంగుష్ఠనఖకాంతి ♦ నొత్తి నడువ, నెఱుపుఁ గ్రక్కెడున ట్లుండు ♦ నింతికాళ్లు
ధరనుదిరుగాడు మెట్టతా ♦ మరలసిరులఁ, దాల్చి యెంతయు సొగసుగాఁ ♦ బొల్చుచుండె.

కాంచ ప్రత్యుపదేశమ్ముఁ ♦ గాళ్లఁ జేరి, యంచెలరవమ్ము నేర్వఁగా ♦ నంచపిండు
తన్నుతాంగికి నేర్పుచు ♦ నున్నదేమొ, లీల నడుచు తెఱంగను ♦ లీలఁ దోఁచె. 34

ఆమెక్రీఁగాళ్ల నాఁడోఁక ♦ యట్టు లుండ, యోగ్యమగువృత్తమును దైర్ఘ్య ♦ ముంచి చేసి
తగినలావణ్యమితరాంగ ♦ తతికిఁ గూర్చ, నుండెనో విధాత యనితోఁచు ♦ చుండెఁ జూడ.

నాగేన్ద్రహస్తా స్త్వచి కర్కశత్వా దేకాన్తశైత్యాత్ కదళీవిశేషాః
లబ్ధ్వాపి లోకే పరిణాహి రూపం జాతా స్తదూర్వో రుపమానబాహ్యాః॥ 36

ఏతావతా న న్వనుమేయశోభి కాఞ్చీగుణస్థాన మనిన్దితాయాః
ఆరోపితం య ద్గిరిశేన పశ్చా దనన్యనారీకమనీయ మఙ్కమ్॥ 37

తస్యాః ప్రవిష్టా నతనాభిరన్ధ్రం రరాజ తన్వీ నవరోమరాజిః
నీవీ మతిక్రమ్య సితేతరస్య తన్మేఖలామధ్యమణే రివార్చిః॥ 38

మధ్యేన సా వేదివిలగ్నమధ్యా వళిత్రయం చారు బభార బాలా,
ఆరోహణార్థం నవయౌవనేన కామస్య సోపాన మివ ప్రయుక్తమ్॥ 39

అన్యోన్య ముత్పీడయ దుత్పలాక్ష్యాః స్తనద్వయం పాణ్డు తథా ప్రవృద్ధమ్
మధ్యే యథా శ్యామముఖస్య తస్య మృణాళసూత్రాన్తర మప్యలభ్యమ్॥ 40

శిరీషపుష్పాధికసౌకుమార్యౌ బాహూ తదీయా వితి మే వితర్కః,
పరాజితే నాపి కృతౌ హరస్య యౌ కణ్ఠపాశౌ మకరధ్వజేన॥ 41

కణ్ఠస్య తస్యాః స్తనబన్ధురస్య ముక్తాకలాపస్య చ ని స్తలస్య
అన్యోన్యశోభాజననా ద్బభూవ సాధారణో భూషణభూష్యభావః॥ 42

చన్ద్రంగతా పద్మగుణాన్న భుఙ్క్తే పద్మాశ్రితా చాన్ద్రమసీ మభిఖ్యామ్
ఉమాముఖం తు ప్రతిపద్య లోలా ద్విసంశ్రయాం ప్రీతి మవాప లక్ష్మీః॥ 43

పుష్పం ప్రవాళోపహితం యది స్యాన్ముక్తాఫలం వా స్ఫుటవిద్రుమస్థమ్
తతో నుకార్యా ద్విశదస్య తస్యా స్తామ్రోష్ఠపర్యస్తరుచః స్మితస్య॥ 44

స్వరేణ తస్యా మమృతస్రుతేవ ప్రజల్పితాయా మభిజాతవాచి
అ ప్యన్యపుష్టా ప్రతికూలశబ్దా శ్రోతు ర్వితన్త్రీ రివ తాడ్యమానా॥ 45

ప్రవాతనీలోత్పలనిర్విశేష మధీరవిప్రేక్షిత మాయతాక్ష్యా
తయా గృహీతం ను మృగాఙ్గనాభ్య స్తతో గృహీతం ను మృగాఙ్గనాభిః॥ 46

తస్యాశ్శలాకాఞ్జననిర్మితేవ కాన్తి ర్భ్రువో రాయతలేఖయో ర్యా
తాం వీక్ష్య లీలాచతురా మనఙ్గః స్వచాపసౌన్దర్యమదం ముమోచ॥ 47

లజ్జా తిరశ్చాం యది చేతసి స్యా దసంశయం పర్వతరాజపుత్ర్యాః
తం కేశపాశం ప్రసమీక్ష్య కుర్యు ర్వాలప్రియత్వం శిథిలం చమర్యః॥ 48

కడువిశాలమ్ములై యిలఁ ♦ గ్రాలియున్నఁ, గఱకుఁదన ముంట నాగేంద్ర ♦ కరము లేని
యధిక శైత్యంబు గలవౌట ♦ ననఁటులేని, యామె తొడలకు సామ్యంబు ♦ నందవయ్యె.

అన్యవనితలు గోరశ ♦ క్యంబుగాని, యంకమున ఘాలి దాలిచె ♦ నవలఁ గాన
నామె మొలనూలు గ్రాలెడు ♦ నట్టిసీమ, యెంతశోభాకరమొ దీన ♦ నెఱుఁగనౌను. 37

దాఁటి నీవిని నాభిరం ♦ ధ్రమును జొచ్చి, పొలుచుసన్ననినూగారు ♦ మొలఁతకటిని
జెలఁగుమొలనూలునడుమను ♦ జెక్కఁబడిన, నీలమణిలోనికిరణమ్ము ♦ లీల నొప్పె. 38

అంగజుం డెక్కి సొగసుగా ♦ యౌవనంబు, గట్టియున్నట్టి మెట్లనాఁ ♦ గ్రాలునట్టి
మూడుముడుఁతల నడుముపైఁ ♦ బూనియుండె, వేదిమధ్యావలగ్న యా ♦ వెలఁదిమిన్న.

నల్లమోములు గలిగి యా ♦ నారికుచము, లొకటి నొకటి యొరయుచు ♦ నుండినదుమఁ
దమ్ముతూఁడులలోపలి ♦ దారమేని, పట్టునెడమైన లేకుండఁ ♦ బ్రబలియుండె. 40

హరునిచే నోడియును మారుఁ ♦ డతనికంఠ, పాశములు గాఁగఁ జేసినా ♦ భాసురాంగి
భుజములను గాన దిరిసెన ♦ పూలకంటె, మెత్తని వటంచు నెంతు నా ♦ చిత్తమందు. 41

క్రాలుగుండ్రనిముత్యాల ♦ కంఠసరము, చనులచే నెత్తుగాంచిన ♦ చానమెడయుఁ[లుఁ
గూడియన్యోన్యమునుశోభఁ ♦ గూర్చుచుండఁ, బొంది దెసమభావమునుభూష్య ♦ భూషణము

చపలురాలైనలక్ష్మి దాఁ ♦ జంద్రుఁ జేరి, యనుభవింపదు పద్మగు ♦ ణాళి నచటఁ
గమలమును గూడి చంద్రుని ♦ కాంతిఁగనదు, కానియుమముఖమునుబొంది ♦ కాంచె రెండు.

చిగురు తెల్లనిపువ్వుతోఁ ♦ జేరెనేని, పగడమో మౌక్తికముపొందు ♦ వడసెనేని
యామె చిఱునవ్వు గూడిన ♦ యధరమునకు, నప్పు డవి పోలఁగల వని ♦ చెప్పవచ్చు.

సుధ లొలుకుచుండునట్టు లా ♦ మధురవాణి, కలికిపలుకులు చల్లఁగాఁ ♦ బలికినపుడు
పికము గూయ, నపశ్రుతి ♦ వీణలోని, శబ్దమట్లది వినుట క ♦ సహ్యమగును. 45

గాలిఁ గదలెడునల్లని ♦ కలువఁబోలు, బెదరుచూపాయతాక్షి యె ♦ వ్విధిని నేర్చె
వాఁడుశేడులు నేర్పెనో ♦ యాఁడులెల్ల, కీమెయే నేర్పియుండునో ♦ యెఱుఁగరాదు.

కాటుకం గొని లోహంపుఁ ♦ గడ్డితోడ, దీర్ఘ నూవాలు రేఖగాఁ ♦ దీర్చినట్లు
తనరుపార్వతిబొమలయం ♦ దమ్ముఁ గాంచి, మరుఁడు దనచాపసౌందర్య ♦ మదము వదలె.

పశువులకు లజ్జయే యున్నఁ ♦ బర్వతేంద్రు, పుత్రి దా కేశపాశమ్ము ♦ పొలుపుఁ గాంచి
యాఁడుచమరంపుమెకములు ♦ వీడ కున్నె, వాని కుండెడువాలాభి ♦ మాన మెల్ల. 48

సర్వోపమాద్రవ్యసముచ్చయేన యథాప్రదేశం వినివేశితేన
సానిర్మితా విశ్వసృజా ప్రయత్నా దేకస్థసౌన్దర్య దిదృక్షయేవ॥ 49

తాం నారదః కామచరః కదాచిత్ కన్యాం కిల ప్రేక్ష్య పితుః సమీపే
సమాదిదే శైకవధూం భవిత్రీం ప్రేమ్ణా శరీరార్ధహరాం హరస్య॥ 50

గురుః ప్రగల్భేపి వయస్యతోఽస్యా స్తస్థౌ నివృత్తాన్యవరాభిలాషః
ఋతే కృశానోర్న హి మన్త్రపూతమర్హన్తి తేజాం స్యపరాణి హవ్యమ్॥ 51

అయాచితారం నహి దేవమద్రి స్సుతాం ప్రతిగ్రాహయితుం శశాక,
అభ్యర్థనాభఙ్గభయేన సాధు ర్మాధ్యస్థ్య మిష్టేప్యవలమ్బతేర్థే॥ 52

య దైవ పూర్వే జననే శరీరం సా దక్షరోషా త్సుదతీ ససర్జ,
తదాప్రభృత్యేవ విముక్తసఙ్గః పతిః పశూనామపరిగ్రహోఽభూత్॥ 53

స కృత్తివాసా స్తపసే యతాత్మా గఙ్గా ప్రవాహోక్షిత దేవదారు
ప్రస్థం హిమాద్రేర్మృగనాభిగన్ధి కిఞ్చిత్క్వణత్కిన్నర మధ్యువాస॥ 54

గణా నమేరుప్రసవావతంసా భూర్జత్వచః స్పర్శవతీ ర్దధానాః
మనశ్శిలావిచ్ఛురితా నిషేదుః శైలేయనద్ధేషు శిలాతలేషు॥ 55

తుషారసంఘాతశిలాః ఖురాగ్రై స్సముల్లిఖన్ దర్పకలః కకుద్మాన్
దృష్టః కథఞ్చిద్గవయై ర్వివిగ్నై రసోఢసింహధ్వని రున్ననాద॥ 56

తత్రాగ్నిమాధాయ సమిత్సమృద్ధం స్వ మేవమూర్త్యన్తరమష్టమూర్తిః
స్వయం విధాతా తపసః ఫలానాం కేనాపి కామేన తపశ్చచార॥ 57

అనర్ఘ్య మర్ఘ్యేణత మద్రినాథః స్వర్గౌకసా మర్చిత మర్చయిత్వా
ఆరాధనా యాస్య సఖీసమేతాం సమాదిదేశ ప్రయతాం తనూజామ్॥ 58

ప్రత్యర్థిభూతా మపి తాం సమాధేః శుశ్రూషమాణాం గిరిశోఽనుమేనే,
వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవధీరాః॥ 59

అవచితబలిపుష్పా వేదిసమ్మార్గదక్షా
నియమవిధిజలానాం బర్హిషాం చోపనేత్రీ

అన్నియుపమానవస్తువు ♦ లలవరించి, వానివానికిఁ దగుచోట్ల ♦ వాని నునిచి
నిఖిలసౌందర్యముల నొక్కట ♦ నెలవునందె, బ్రహ్మ గనఁగోరినట్లు పా ♦ ర్వతిని జేసె.

నారదుఁ డకామచరుఁ డొక్క ♦ నాఁడు వేడ్కఁ, దండ్రికడనున్నయకన్య ♦ ధన్యఁ గాంచి
యొక్కతే భార్యయయియామె ♦ యొప్పుప్రేమ, హరునియర్ధాంగము హరించు ♦ నంచుఁ దెలిపె

కాన నెలజవ్వనమున న ♦ కన్నె యున్న, వేఱువరునకునై తండ్రి ♦ వెదుక కుండె
భవ్యమంత్రప్రపూత మా ♦ హవ్య మిడఁగ, నగ్ని గానట్టి తేజమ్ము ♦ లర్హ మగునె. 51

అడుగ కున్నట్టి హరునిచే ♦ నద్రిరాజు, పుత్రిని గ్రహింపఁజేయఁగాఁ ♦ బూనఁ డయ్యె
వ్యర్థ మగుననుభీతి ని ♦ ష్ప్రార్థమేని, పరుల నడుగరుగా బుధుల్ ♦ స్వయముగాను. 52

పూర్వజన్మనఁ దత్సతి ♦ పూతచరిత, తండ్రి యగుదక్షునకు నల్గి ♦ తనువు వీడ
నాఁటిమండియు సర్వసం ♦ గముల వీడి, యొంటిఁ బశుపతి భార్య లే ♦ కుండ నుండె.

తపము సేయంగ గంగచేఁ ♦ దడియుచుండు, సరళతరులతతి, మృగనాభి ♦ పరిమళమ్ము,
గిన్నరులపాట గలహిమ ♦ వన్నగంబు, నెత్తమును గృత్తివాసుండు ♦ నియతిఁ జేరె. 54

చెలఁగుసురపొన్నపువ్వులు ♦ సిగను దాల్చి, పాలుపుగా భూర్జవల్కల ♦ ములను గట్టి
మణిశిలాగంధము నలంది ♦ గణము లుండె, రాతిపూచేత రాజిల్లు ♦ శాలమీఁద. 55

హిమశిలల గిట్టలం గొట్టి ♦ యెగయఁ ద్రవ్వి, మదమధురనిస్వనముచేతఁ ♦ బొదలువృషము
ప్రబలసింహధ్వనుల కల్గి ♦ ఱంకె వైచెఁ, గడు బెదరి తన్ను వీక్షింప ♦ గవయవితతి. 56

తపములఫలంబులకుఁ దా వి ♦ ధాత యయ్యు, స్వీయరూపాంతరం బగు ♦ వీతిహోత్రు
సమిధ లిడి ప్రజ్వరిలఁ జేసి ♦ శంకరుండు, దేనినో కూర్చి యట సల్పెఁ ♦ దీవ్రతపము.

చేరి హిమవంతుఁ డర్ఘ్యంబు ♦ చే ననర్ఘ్యు, దేవపూజ్యుని బూజించి ♦ దేవదేవు
నాహరుని సేవ సేయఁగా ♦ నాత్మసుతను, నియతను సఖీసమేతను ♦ నిలిపె నచట. 58

శూలి తననిష్ఠకుం బ్రతి ♦ కూల యయ్యు, సేవ సల్పెడునకన్య ♦ సేవ కొప్పెఁ
కారణం బుండ వికృతికి ♦ నేరిమనసు, మాఱకుండునో ♦ వారలే ♦ ధీరు లనఁగ. 59

ఉత్పలము. పూలను గోసి తెచ్చి యిడుఁ ♦ బూజకు వేదిని జక్కఁజేసెడున్
జాలినయంతనిష్ఠ కగు ♦ స్వచ్ఛజలంబులు దర్భ లుంచెడున్

గిరిశ ముపచచార ప్రత్యహం సా సుకేశీ
నియమితపరిఖేదా తచ్ఛిరశ్చన్ద్రపాదైః॥ 60

ఇతి శ్రీకాలిదాసకృతౌ కుమారసంభవే మహాకావ్య ఉమోత్పత్తి
ర్నామ ప్రథమస్సర్గః.



బాల సుకేశి యిట్లు శివుఁ ♦ బ్రత్యహమున్ భజియించుచుండెడుఁగ
శూలిశిరంబునం బొలుచు ♦ సోమునికాంతులు సేదదీర్పఁగాన్. 60

## గద్య.

ఇది శ్రీపరమేశ్వరకరుణాఫలిత లలితకవితాకలిత శ్రీరామలక్ష్మాంబా
బుచ్చివేంకయామాత్యతనూజాత సకలసజ్జనవిధేయ ఆదిపూడి
సోమనాథనామధేయప్రణీతం బయినయాంధ్రకుమార
సంభవమ్మునందు నుమోత్పత్తి
యనుప్రథమాశ్వాసము.







# కుమారసంభవమ్.



## ద్వితీయస్సర్గః.



తస్మిన్ విప్రకృతాః కాలే తారకేణ దివౌకసః
తురాసాహం పురోధాయ ధామ స్వాయంభువం యయుః॥ 1

తేషా మావిరభూ ద్బ్రహ్మా పరిమ్లానముఖశ్రియాం,
సరసాం సుప్తపద్మానాం ప్రాత ర్దీధితిమా నివ॥ 2

అథ సర్వస్య ధాతారం తే సర్వే సర్వతోముఖమ్
వాగీశం వాగ్భి రర్థ్యాభిః ప్రణిపత్యోపతస్థిరే॥ 3

నమ స్త్రిమూర్తయే తుభ్యం ప్రాక్ సృష్టేః కేవలాత్మనే
గుణత్రయవిభాగాయ పశ్చా ద్భేద ముపేయుషే॥ 4

యదమోఘ మపా మన్త రుప్తం బీజ మజ త్వయా,
అత శ్చరాచరం విశ్వం ప్రభవ స్తస్య గీయసే॥ 5

తిసృభి స్త్వ మవస్థాభి ర్మహిమాన ముదీరయన్
ప్రళయస్థితిసర్గాణా మేకః కారణతాం గతః॥ 6

స్త్రీపుంసా వాత్మభాగౌ తే భిన్నమూర్తేః సిసృక్షయా,
ప్రసూతిభాజః సర్గస్య తా వేవ పితరౌ స్మృతౌ॥ 7

స్వకాలపరిమాణేన వ్యస్తరాత్రిన్దివస్య తే
యౌ తు స్వప్నావబోధౌ తౌ భూతానాం ప్రళయోదయౌ॥ 8

జగద్యోని రయోని స్త్వం, జగదన్తో నిరన్తకః,
జగదాది రనాది స్త్వం, జగదీశో నిరీశ్వరః॥ 9



శ్రీ

# కుమారసంభవము.



## ద్వితీయాశ్వాసము.



### గీతములు.

శంభు నుమ యట్లు సేవించు ♦ సమయమందుఁ, దారకాసురుచేత సం♦తాప మొంది
యింద్రుఁ దమముందు నిడుకొని♦యెల్లసురలు, దరలిపోయిరి పరమేష్ఠి♦ ధామమునకు.
వదనకాంతులు వాడిన ♦ వారలకును, దక్షిణంబున ధాత ప్ర♦త్యక్ష మయ్యె
జలజములు మోడ్చి యుండెడు ♦ కొలఁకులకును, వేకువను రవి దోఁచెడు ♦ విధము దోఁప.
అంతఁ బ్రణమిల్లి వాగీశుఁ ♦ డైనవాని, నన్నిదిక్కుల వదనమ్ము ♦ లమరువాని
నెల్లలోకమ్ములను సృజి ♦ యించువాని, సార్థకమ్ముగఁ బొగడి ర ♦ య్యమరులెల్ల. 3
ఒకఁడవె సృష్టికిని బూర్వ ♦ మొప్పుచుండి, యవలఁ ద్రిగుణవిభాగంబు ♦ నమరఁ జేసి
పడసి భేదంబు మూఁడురూ ♦ పములఁ దాల్చి, వఱలుచుండెడు నీ కిదె ♦ వందనంబు. 4
జననరహితుఁడ వోదేవ ♦ జలమునందు, రిత్త వోనట్టిబీజంబు ♦ విత్తఁగానె
వింత నొదవెఁ జరాచర ♦ విశ్వమెల్లఁ, గానఁ దత్కారణఖ్యాతిఁ ♦ గంటి వీవు. 5
కేవలం బొకఁడవె యయ్యు ♦ దేవదేవ!, మూఁడవస్థలయందును ♦ గూడి యుండి
భవ్య మౌనీప్రభావంబు ♦ ప్రకటపఱిచి, స్థితివిలయసృష్టిహేతు వై ♦ చెలఁగు దీవు. 6
స్త్రీపురుషసృష్టి సేయఁగా ♦ రెండుగాను, జీలి చెలఁగెడు నీరెండు ♦ చీలికలకె
సృష్టి సేయంగఁబడు సర్వ ♦ జీవులందుఁ, దల్లి యను తండ్రి యనుపేళ్లు♦ చెల్లునండ్రు.
నీదుకాలంబులోపల ♦ నీకు దేవ!, నిద్రగన మేలుకొనఁగను ♦ నియత మైన
రాత్రి దివమును నిర్మిత ♦ ప్రాణులకును, బ్రళయముగ సృష్టిగాఁగను ♦ బరిణమిల్లు. 8
కారణము లేనియాజగ ♦ త్కారణుఁడవు, అంతమే లేనియాజగ ♦ దంతకుఁడవు
ఆది లేనట్టియాజగ ♦ దాది వీవు, ఈశ్వరుఁడు లేనియాజగ ♦ దీశుఁ డీవు. 9

ఆత్మాన మాత్మనా వేత్సి, సృజ స్యాత్మాన మాత్మనా,
ఆత్మనా కృతినా చ త్వ, మాత్మ న్యేవ ప్రలీయసే॥ 10

ద్రవ స్సంఘాతకఠినః, స్థూలః సూక్ష్మో, లఘు ర్గురుః,
వ్యక్తో వ్యక్తేతర శ్చాసి, ప్రాకామ్యం తే విభూతిషు॥ 11

ఉద్ఘాతః ప్రణవో యాసాం, న్యాయై స్త్రిభి రుదీరణమ్,
కర్మ యజ్ఞః, ఫలం స్వర్గ, స్తాసాం త్వం ప్రభవో గిరామ్॥ 12

త్వా మామనన్తి ప్రకృతిం పురుషార్థప్రవర్తినీం,
తద్దర్శిన ముదాసీనం త్వా మేవ పురుషం విదుః॥ 13

త్వం పితౄణా మపి పితా, దేవానా మపి దేవతా,
పరతోఽపి పర శ్చాసి, విధాతా వేధసా మపి॥ 14

త్వ మేవ హవ్యం హోతా చ, భోజ్యం భోక్తా చ, శాశ్వతః,
వేద్యం చ వేదితా చాసి, ధ్యాతా ధ్యేయం చ యత్ పరమ్॥ 15

ఇతి తేభ్యః స్తుతీః శ్రుత్వా యథార్థా హృదయఙ్గమాః,
ప్రసాదాభిముఖో వేధాః ప్రత్యువాచ దివౌకసః॥ 16

పురాణస్య కవే స్తస్య చతుర్ముఖసమీరితా
ప్రవృత్తి రాసీ చ్ఛబ్దానాం చరితార్థా చతుష్టయీ॥ 17

స్వాగతం స్వా నధికారాన్ ప్రభావై రవలమ్బ్య వః
యుగప ద్యుగబాహుభ్యః ప్రాప్తేభ్యః ప్రాజ్యవిక్రమాః॥ 18

కి మిదం ద్యుతి మాత్మీయాం న బిభ్రతి యథాపురా
హిమక్లిష్టప్రకాశాని జ్యోతీంషీవ ముఖాని వః? 19

ప్రశమా దర్చిషా మేత దనుద్గీర్ణసురాయుధం
వృత్రస్య హన్తుః కులిశం కుణ్ఠితాశ్రీవ లక్ష్యతే? 20

కిం చాయ మరిదుర్వారః పాణౌ పాశః ప్రచేతసః
మన్త్రేణ హతవీర్యస్య ఫణినో దైన్య మాశ్రితః? 21

కుబేరస్య మనశ్శల్యం శంసతీవ పరాభవం
అపవిద్ధగదో బాహు ర్భగ్నశాఖ ఇవ ద్రుమః॥ 22

నిన్నుఁ దెలియుచు నుందువు ◆ నీకు నీవె, నిన్ను సృజియించుకొందువు ◆ నీకు నీవ
యన్ని సామర్థ్యములు నీకు ◆ నమరి యుంట, నందుచుందువు లయము నీ◆యందు నీవె.
నీవె కఠినంబు ద్రవమును ◆ నీవె లఘువు, నీవె స్థూలంబు సూక్ష్మంబు ◆ నీవె గురువు
ఎల్లకారణకార్యమ్ము ◆ లీవె యగుచుఁ, బూనియుందువు స్వేచ్ఛ వి ◆ భూతులందు. 11
అధియం దోంకృతినిగాంచి ◆ యలరునట్టి, మువ్విత మ్మైనస్వరములు ◆ పొదలునట్టి
జన్న మేకార్యమై మఱి ◆ స్వర్గసుఖమె, ఫలముగలయట్టివాని కెల్ల ◆ ప్రభుఁడ వీవు. 12
భోగమోక్షార్థములయందుఁ ◆ బురుషుఁ గొలుప, ప్రకృతి నీవని కొందఱు ◆ పలుకుచుంద్రు
తాను గూటస్థుఁ డైయుండి ◆ దానిఁ జూచు, పురుషుఁ డీవని కొందఱు ◆ బుద్ధిఁగాంత్రు.
పితరు లందఱికిఁ గూడఁ ◆ బితవు నీవు, దేవతల కందఱికిఁ గూడఁ ◆ దేవుఁ డీవు
ధాత లందఱి కరయ వి ◆ ధాత వీవు, దలఁపునకు మీఱు నాపరా ◆ త్పరుఁడ వీవు. 14
నీవె హవ్యమ్ము నిత్యుఁడౌ ◆ నీవె హోత, నీవె భోజ్యమ్ము మఱియును ◆ నీవె భోక్త
నీవె వేద్యమ్ము తలఁపఁగా ◆ నీవె వేత్త, నీవె పర మైనధ్యేయమ్ము ◆ నీవె ధ్యాత. 15
ఇట్లు పొగడంగ సత్యముల్ ◆ హృద్యతరము, లైనవినుతుల నాలించి ◆ యవ్విధాత
యెంతయుఁ బ్రసన్నమతి యయి ◆ యిట్లు పలికె, వినఁగవేడుకపడుచుండు ◆ వేల్పులకును.
అప్పురాణకవీంద్రుని ◆ వై వెలుంగు, నాలుగుముఖమ్ములం దుండి ◆ లీల వెడలి
నాలుగువిధమ్ములను గల్గి ◆ క్రాలుచుండు, భాష సార్థకభావంబు ◆ వడసి వఱలె. 17
ప్రబల మౌవిక్రమంబుచే ◆ వఱలుచుండి, కాడివంటిభుజమ్ములఁ ◆ గ్రాలుచుండి
మీపదవులందు దక్షు లై ◆ మెలఁగుమీర, లేక సమయాన వచ్చితి ◆ రేమి సుఖమె?
మంచుచేఁ దమకాంతులు ◆ మందగిలిన, చుక్కలట్టులు మీమోము ◆ లక్కటకట
పూర్వమట్టులు దమతమ ◆ పూర్ణకాంతి, వెలుఁగకున్న వవేలొకో ◆ వేల్పులార! 19
అతులదివ్యప్రభాచ్ఛట ◆ లడఁగిపోయి, చిత్రసురచాపకాంతులఁ ◆ జిమ్మకుండు
వృత్రసంహారుకులిశంబు ◆ విధ మదేమొ, మొనలు చెడిమొక్కవోయెనో ◆ యనఁగఁదోఁచె.
అరుల కెంతేయు దుర్వార ◆ మైనయట్టి, యీవరుణపాశ మేలొకో ◆ యేపుదక్కి
మంత్రమునఁ గట్టువడి వీర్య ◆ మహిమ చెడిన, నాగమట్టులు విన్నద ◆ నంబుఁ దాల్చె.
శాఖ విరిగినవృక్షమ్ము ◆ సరణి నుండు, గద దొరంగినయక్షేశు ◆ కరముఁ జూడు
వఱనివాహృదయంబునకు శల్య ◆ మట్టు లుండు, భంగపాటును దెలిపెడు ◆ పగిది నుండె

యమోపి విలిఖన్ భూమిం దణ్డే నాస్తమితత్విషా
కురుతేస్మి న్నమోఘోపి నిర్వాణాలాతలాఘవమ్॥ 23

అమీ చ కథ మాదిత్యాః ప్రతాపక్షతిశీతలాః
చిత్రన్యస్తా ఇవ గతాః ప్రకామాలోకనీయతామ్॥ 24

పర్యాకులత్వా న్మరుతాం వేగభఙ్గోనుమీయతే,
అమ్భసా మోఘసంరోధః ప్రతీపగమనా దివ॥ 25

ఆవర్జితజటామౌళివిలమ్బి శశికోటయః
రుద్రాణా మపి మూర్ధానః క్షతహుంకారశంసినః॥ 26

లబ్ధప్రతిష్ఠాః ప్రథమం యూయం కిం బలవత్తరైః
అపవాదై రి వోత్సర్గాః కృతవ్యావృత్తయః పరైః? 27

త ద్బ్రూత వత్సాః కి మితః ప్రార్థయధ్వం సమాగతాః;
మయి సృష్టిర్హి లోకానాం రక్షా యుష్మా స్వవస్థితా॥ 28

తతో మన్దానిలోద్ధూత కమలాకర శోభినా
గురుం నేత్రసహస్రేణ చోదయామాస వాసవః॥ 29

స ద్వినేత్రం హరే శ్చక్షు స్సహస్రనయనాధికం
వాచస్పతి రువా చేదం ప్రాఞ్జలి ర్జలజాసనమ్॥ 30

ఏవం య దాత్థ భగవ న్నామృష్టం నః పరైః పదం,
ప్రత్యేకం వినియుక్తాత్మా కథం న జ్ఞాస్యసి ప్రభో? 31

త్వయా దత్తవరోదీర్ణ స్తారకాఖ్యోమహాసురః
ఉపప్లవాయ లోకానాం ధూమకేతు రి వోత్థితః॥ 32

పురే తావన్త మే వాస్య తనోతి రవి రాతపం
దీర్ఘికాకమలోన్మేషో యావన్మాత్రేణ సాధ్యతే॥ 33

సర్వాభిః సర్వదా చన్ద్రః తం కళాభి ర్నిషేవతే,
నాదత్తే కేవలాం లేఖాం హరచూడామణీకృతామ్॥ 34

వ్యావృత్తగతి రుద్యానే కుసుమస్తేయసాధ్వసాత్
న వాతి వాయు స్తత్పార్శ్వే తాళవృన్తానిలాధికమ్॥ 35

మొక్కవోనట్టి దయ్యాన ♦ దక్కశోభ, యున్న తనచేతిదండమ్ము ♦ నుర్వి యముఁడు
గీచి దైన్యంబు దానికిఁ ♦ గీలుకొలుప, నాఁటిపోయినకొఱవియో ♦ యనఁగఁ దోఁచె.

భాస్కరులు వీరు దమప్రతా♦పములుపోయి, చల్లఁదనమునుగాంచియా♦చందమునను
జిత్రలిఖితంబులైనట్టి ♦ చిత్రభాను, లట్లు కనులకు గోచరం ♦ బైరిదేమి? 24

పతనవేగము వెనుకకుఁ ♦ దిరిగెనేని, యడ్డ మేదియు వచ్చిన ♦ దంచుఁ దోఁచు
పగిది నీ వాయువులు తడఁ ♦ బడుట చూడ, నడ్డ మేదియు కలిగిన♦దంచుఁ దోఁచె.

వాలి జడగుంపు వానిలోఁ ♦ గ్రాలుచున్న, బాలశశిరేఖ లెంతయు ♦ వ్రేలుచుంటఁ
జాటుచున్నవి యీరుద్ర♦కోటి సేయు, హూంకృతికిఁగూడ భంగపా♦టొదవెనంచు.

విధులలోపల సామాన్య ♦ విధులమహిమ, మించెడువిశేషవిధు లాక్ర♦మించునట్లు
గౌరవము గన్నమీయధి ♦ కారములను, మిమ్ము మించినవా రాక్ర ♦ మించినారె. 27

ఎల్లరును గూడి యిట్టు లో ♦ పిల్లలార!, యేమి వేఁడంగ వచ్చితి ♦ రిటకుఁ జెప్పుఁడు
అఖిలజగములసృష్టి నా ♦ యందువలెనె, పెంచుభారంబు మీయందుఁ ♦ బెట్టఁబడియె.

అనిన బ్రహ్మకు వజ్రి మం ♦ దానిలమునఁ, గదలుకమలాకరముశోభఁ♦గాంచి వెలఁగు
వేయిచూపులతోడను ♦ వేడ్కమీఱ, గురుని బ్రత్యుత్తరము సెయ్యఁ♦గొలిపె నంత. 29

వేయికన్నులవానికి ♦ వేయికనుల, కంటె మించినయిరుకనుల్ ♦ కలిగి వెలుఁగు
నాబృహస్పతి మోడ్చి హ♦స్తాబ్జయుగము, నన్నలువ కివ్విధంబున ♦ విన్నవించె. 30

నీవు చెప్పినదెంతయు ♦ నిక్కవంబు, వైరులను జేరె మాయధి ♦ కారమెల్ల
నెల్లపురుషులయందుండి ♦ యెఱుఁగ వెట్టు, లో ప్రభూ? భగవానుఁడా!♦యోవిధాత

నీవరంబున గర్వించి ♦ దేవదేవ, తారకాఖ్యధరించిన ♦ దానవుండు
ధూమకేతువువిధమునఁ ♦ దోఁచినాఁడు, లేచినాఁడు జగంబుల ♦ వేఁచినాఁడు. 32

వీని పురమందు సూర్యుండు ♦ విబుధవర్య, యబ్జములు డిగ్గియలయందు ♦ నలరుటకును
నెంత మాత్రమువలయునో ♦ యంతయెండఁ, గాచునేకాని యెక్కువఁ ♦ గాయకుండు.

శివునిశిరమున మణియయి ♦ వెలఁగుచుండు, నొక్కకళమాత్రమును వీడి♦యొద్దఁ జేరి
సర్వదా సర్వకళలచేఁ ♦ జంద్రుఁ డతని, సేవ మెలఁకువఁదప్పక ♦ సేయుచుండు. 34

పూల దొంగిలునేరము ♦ మోపునేమొ, యనెడుభయమున వాయువు♦ద్యానవనిని
దిరుగుటలు మాని యాతని ♦ సరసఁ జేరి, వీవనకు మించుగాలిని ♦ వీవకుండు. 35

పర్యాయసేవా ముత్సృజ్య పుష్పసంభారతత్పరాః
ఉద్యానపాలసామాన్య మృతవః షట్త ముపాసతే॥

త స్యోపాయనయోగ్యాని రత్నాని సరితాం పతిః
కథ మ ప్యమ్భసా మన్త రానిష్పత్తేః ప్రతీక్షతే॥

జ్వలన్మణిశిఖాశ్చైనం వాసుకిప్రముఖా నిశి
స్థిరప్రదీపతా మేత్య భుజఙ్గాః పర్యుపాసతే॥

తత్కృతానుగ్రహాపేక్షీ తం ముహు ర్దూతహారితైః
అనుకూలయ తీన్ద్రోఽపి కల్పద్రుమవిభూషణైః॥

ఇత్థ మారాధ్యమానోఽపి క్లిశ్నాతి భువనత్రయం,
శామ్యేత్ ప్రత్యపకారేణ నోపకారేణ దుర్జనః॥

తేనామరవధూహస్తైః సదయాలూనపల్లవాః
అభిజ్ఞా శ్ఛేదపాతానాం క్రియన్తే నన్దనద్రుమాః॥

వీజ్యతే స హి సంసుప్తః శ్వాససాధారణానిలైః
చామరైః సురబన్దీనాం బాష్పశీకరవర్షిభిః॥

ఉత్పాట్య మేరుశృఙ్గాణి క్షుణ్ణాని హరితాం ఖురైః
ఆక్రీడపర్వతా స్తేన కల్పితాః స్వేషు వేశ్మసు॥

మన్దాకిన్యాః పయః శేషం దిగ్వారణమదావిలం
హేమామ్భోరుహసస్యానాం తద్వాప్యో ధామ సామ్ప్రతమ్॥

భువనాలోకనప్రీతిః స్వర్గిభి ర్నానుభూయతే
ఖిలీభూతే విమానానాం తదాపాతభయా త్పథి॥

యజ్వభి స్సంభృతం హవ్యం వితతే ష్వధ్వరేషు నః
జాతవేదోముఖా న్మాయీ మిషతా మాచ్ఛినత్తి సః॥

ఉచ్చై రుచ్చైఃశ్రవా స్తేన హయరత్న మహారి చ
దేహబద్ధ మి వేన్ద్రస్య చిరకాలార్జితం యశః॥

తస్మి న్నుపాయాః సర్వే నః క్రూరే ప్రతిహతక్రియాః,
వీర్యవన్త్యౌషధా నీవ వికారే సాన్నిపాతికే॥

ఒకటితరువాత నొకటిగా ♦ నొప్పుగతిని, మాని ఋతుషట్క మొకట ♦ వానిసేవ
సేయుచుండును బువ్వుల ♦ సేకరించు, తోఁటమాలులతోఁ బాటు ♦ పాటుపడుచు. 36

ఆతనికిఁ గానుకగాఁ దగు ♦ నమలమణులఁ, బూర్ణ మైనట్టిశ్రద్ధని ♦ బొంగు బాఁకఁ
గాచుచుండును నీళ్లలో ♦ దాఁచి యుంచి, నదులపతియైనవాఁడు ర♦త్నాకరుండు. 37

వెలుఁగుచుండెడుమణులను ♦ దలలఁ దాల్చి, వాసుకియె యాదిగాఁగల ♦ ఫణులుదరిని
నిలిచి రాత్రుల నాతనిఁ ♦ గొలుచుచుండు, రాతిపోనట్టిదీపాల ♦ యంద మొంది. 38

వానిదయఁ గోరి మాటికి ♦ వజ్రపాణి, కల్పతరువులలోపలఁ ♦ గలిగి మిగులఁ
జెలుఁగుభూషల దూతల ♦ చేతఁ బంపి, తనకు ననుకూలముగఁ జేసి ♦ కొనుచు నుండు.

నిలువ కందఱు నివ్విధిఁ ♦ గొలుచుచున్న, ముజ్జగంబులఁ బీడలో ♦ ముంచుచుండు
నవని దుష్టుండు కీడుచే ♦ నణఁగుఁ గాని, మంచిచే నెన్నఁడేని శ ♦ మింపఁగలఁడె ?40

ఎంతయోజాలి దేవతా ♦ కాంత లెపుడు, పల్లవమ్ములఁ గోసెడు ♦ పాదపములు
వానిచేతను నందన ♦ వనమునందు, నఱకు దెబ్బలఁ గాంచుచుఁ ♦ బొరలెఁ గ్రింద॥ 41

అతఁడు నిద్రించుచుండెడు ♦ నపుడు కూడఁ, దగినయూపిరిగాలియుఁ ♦ దగినయశ్రు
బిందువులతోడఁ జామరాల్ ♦ వీచుచుండ్రి, వాఁడు చెఱఁగొన్న దేవతా ♦ వనిత లెల్ల.

భానుగుత్తాలడెకరల ♦ వలన నలఁగు, మేరుశృంగాళి పెకలించి ♦ మించి వాఁడు
కేళి కనువగుపర్వత ♦ పాళి గాఁగ, నిలుపుకొన్నాఁడు తనవగు ♦ నిలయములను. 43

పైరు చేయంగఁబడుటకై ♦ పైఁడితమ్ము, లతనిబావులె నెలవుగా ♦ నందుఁ జేర
దిక్కరులదానధారచేఁ ♦ దేట చెడిన, నీరుమాత్రమె మిన్నేట ♦ నిలిచె నిపుడు. 44

వాఁడు గన మీఁదఁ బడునను ♦ భయముచేతఁ, బాడుపడియుండునువిమాన ♦ పథముగాన
ననుభవింపరు లోకముల్ ♦ గనెడుప్రీతి, దేవలోకంబునందలి ♦ దేవతాళి. 45

యజ్ఞ మొనరించువారలు ♦ యజ్ఞమందు, హవ్యమిడ మాకునోరయి ♦ యలరుచుండు
నగ్నినుండియె వాఁడు మా ♦ యావియసుర, యొడిసికొనుచుండు ఖిన్నులౌ ♦ చుండ మేము.

చిరతరంబుగ నింద్రుఁడా ♦ర్జించినట్టి, కీర్తి మూర్తీభవించిన ♦ క్రియను గ్రాలి
చాల నెత్తుగఁ బొల్చు న ♦ య్యుచ్చైశ్రవాఖ్య, వాజిరాజంబు వానిచేఁ ♦ బట్టువడియె. 47

క్రూరుఁ డగువానిమీఁదను ♦ గొలిపినట్టి, యధికతరములు మాయుపా ♦ యంబులెల్ల
సన్నిపాతజ్వరంబుపై ♦ సారెఁబొసఁగు, నౌషధము లట్లు వ్యర్థంబు ♦ లగుచుఁ జనియె. 48

జయాశా యత్ర చాస్మాకం ప్రతిఘాతోత్థితార్చిషా
హరిచక్రేణ తే నాస్య కణ్ఠే నిష్క మి వార్పితమ్॥ 49

తదీయా స్తోయదే ష్వద్య పుష్కరావర్తకాదిషు
అభ్యస్యన్తి తటాఘాతం నిర్జితైరావతా గజాః॥ 50

త దిచ్ఛామో విభో స్రష్టుం సేనాన్యం తస్య శాన్తయే,
కర్మబన్ధచ్ఛిదం ధర్మం భవ స్యేవ ముముక్షవః॥ 51

గోప్తారం సురసైన్యానాం యం పురస్కృత్య గోత్రభిత్
ప్రత్యానేష్యతి శత్రుభ్యో బన్దీ మివ జయశ్రియమ్॥ 52

వచ స్యవసితే తస్మిన్ ససర్జ గిర మాత్మభూః,
గర్జితానన్తరాం వృష్టిం సౌభాగ్యేన జిగాయయా॥ 53

సంపత్స్యతే వః కామోయం, కాలః కశ్చిత్ ప్రతీక్ష్యతాం,
న త్వస్య సిద్ధౌ యాస్యామి సర్గవ్యాపార మాత్మనా॥ 54

ఇతః స దైత్యః ప్రాప్తశ్రీ ర్నేత ఏ వార్హతి క్షయం,
విషవృక్షోపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్॥ 55

వృతం తే నేద మేవ ప్రాఙ్మయా చాస్మై ప్రతిశ్రుతం,
వరేణ శమితం లోకా నలం దగ్ధుం హి తత్తపః॥ 56

సంయుగే సాంయుగీనం త ముద్యన్తం ప్రసహేత కః,
అంశా దృతే నిషిక్తస్య నీలలోహితరేతసః? 57

స హి దేవః పరం జ్యోతి స్తమఃపారే వ్యవస్థితమ్,
పరిచ్ఛిన్నప్రభావర్ధి ర్న మయా న చ విష్ణునా॥ 58

ఉమారూపేణ తే యూయం సంయమస్తిమితం మనః
శంభో ర్యతధ్వ మాక్రష్టు మయస్కాన్తేన లోహవత్॥ 59

ఉభే ఏవ క్షమే వోఢు ముభయో ర్బీజ మాహితం,
సా వా శంభో స్తదీయా వా మూర్తి ర్జలమయీ మమ॥ 60

త స్యాత్మా శితికణ్ఠస్య సైనాపత్య ముపేత్య వః
మోక్ష్యతే సురబన్దీనాం వేణీ ర్వీర్యవిభూతిభిః॥ 61

మరట లెగయంగ విజయాశ ♦ మాకుఁ గలుగ, వ్రయ్యగా నెత్తి విష్ణుండు ♦ వైచినట్టి
యమ్మహాచక్ర మాతని ♦ యఱుతయందు, వింతపతకంబురీతిని ♦ వ్రేలఁదొడఁగె. 49

ఇంద్రు నైరావతము నోర్చి ♦ యెసఁగుచుండు, వానిగజములు పుష్కరా ♦ వర్తకాది
మేఘతటముల డీకొని ♦ మించి యిప్డు, వప్రకేళిని స్వేచ్ఛ నే ♦ ర్వంగఁ దొడఁగె.

మోక్షకాంక్షులు సంసృతి ♦ పాలియుకొఱకుఁ, గర్మబంధంబుఁ దెగఁద్రుంచు ♦ ధర్మమెట్లు
కోరుచుందురో మే మట్లు ♦ తారకాఖ్యుఁ, గూల్చు సేనానిఁ బుట్టింపఁ ♦ గోరినాము.

సురలసైన్యంబు గాపాడు ♦ శూరు నెవని, ముందునిడుకొని వైరుల ♦ యందు నుండి
చెఱఁగొనినదానివలె జయ ♦ శ్రీని మరల, వజ్రి తేఁగల్గునో యట్టి ♦ వాని నిమ్ము. 52

అంచు గురువు ముగింప న ♦ నంతరమున, బ్రహ్మదేవుఁ డొనర్చె సం ♦ భాషణంబు
నరముతరువాతఁ గలిగెడు ♦ నరుసువృష్టి, యందమును మించుచుండ నా ♦ నందముగను.

వినుఁడు మీకోర్కి యిది నెఱ ♦ వేఱఁగలదు, కొంతకాలము మీరోర్చు ♦ కొనఁగవలయు
దీనిసమకూర్చుటకుఁ గాను ♦ బూనలేను, స్వయముగా సృష్టిసేయువ్యా ♦ పార మేను.

కలిగె సిరి వాని కిటనుండి ♦ కాన వాఁడు, క్షయము నిటనుండియే పొందఁ ♦ గాదు కాదు
తాను పెంచినయది విష ♦ తరువె యేని, దాని స్వయముగ నఱుకంగఁ ♦ దగదు తగదు.

వాఁడు నేఁ జెప్పఁబోయెడు ♦ వరమె తొల్లిఁ, గోరి నాచేత నెరవేర్చు ♦ కొనియె దాని
జగములెల్లను గాల్పంగఁ ♦ జాలువాని, తపము నాపరమునఁ గాదె ♦ యుపశమిల్లె. 56

క్షేత్రమును బొందినట్టియా ♦ శివుని వైన, వీర్యభాగంబు దప్ప నే ♦ వీరుఁ డైన
రణమునకుఁ బూని దక్షుఁ డై ♦ క్రాలువాని, నెదురుకొని నిల్చి పోల్చి జ ♦ యింపలేఁడు.

దేవుఁడు శివుండు తమముపైఁ ♦ దేజరిల్లు, నుత్తమజ్యోతిరూప మై ♦ యొప్పుచుండు
నతనిమహిమ నెఱుంగఁగ శ ♦ క్యంబు గాదు, నాకుఁగాని మహావిష్ణు ♦ నకును గాని. 58

నిశ్చలసమాధిలోపల ♦ నిలిచి యుండు, శూలిమనసును బార్వతి ♦ సొబగుచేత
నినుము సూదంటుఱాతిచే ♦ నెట్లొ యట్లు, లాగయత్నంబు సేయుఁడు ♦ బాగుగాను. 59

ఇర్వురము మే మొసంగెడు ♦ నిద్ధతేజ, మోర్వఁజాలినయట్టివా ♦ రిర్వు రుంద్రు
హరునితేజముఁ దాలుచు ♦ నద్రితనయ, పూను నా తేజు శివురూప ♦ మైనజలము. 60

ఆగరళకంఠునాత్మజుఁ ♦ డైనవాఁడు, మీకు సేనాధిపతి గాఁగ ♦ మీరు శౌర్య
సంపదల నొప్పి చెఱఁబడ్డ ♦ స్వర్గసతుల, జడలు గట్టినముడి విప్పి ♦ సంతసింత్రు. 61

ఇతి వ్యాహృత్య విబుధాన్ విశ్వయోని స్తిరోదధే;
మన స్యాహిత కర్తవ్యాః తేపి దేవా దివం యయుః॥ 62

తత్ర నిశ్చిత్య కందర్ప మగమత్ పాకశాసనః
మనసా కార్యసంసిద్ధౌ త్వరాద్విగుణరంహసా॥ 63

అథ స లలితయోషిద్భ్రూలతాచారుశృంగం
రతివలయపదాంకే చాప మాసజ్య కంఠే,
సహచర మధు హస్తన్యస్త చూతాంకురాస్త్రః
శతమఖ ముపతస్థే ప్రాంజలిః పుష్పధన్వా॥ 64

ఇతి శ్రీకాళిదాసకృతౌ కుమారసంభవే మహాకావ్యే బ్రహ్మ
సాక్షాత్కారో నామ ద్వితీయస్సర్గః.



ఇట్లు సురలకుఁ దెల్పి య◆దృశ్యుఁ డయ్యె, విశ్వకారణమూర్తి యై◆ వెలుఁగుబ్రహ్మ
దేవతలు గూడఁ బ్రీతితో ◆ దివికిఁ జనిరి, మనసులను జేయవలసిన ◆ పనుల నునిచి. 62

శంభుమనమును లాగంగఁ ◆ జాలు నొకఁడు, చిత్తజుఁడె యంచుఁ గార్యసం◆సిద్ధిలోని
తమిని రెట్టింపువడిగొన్న ◆ తలఁపులోన, జంభశాసనుఁ డాస్మరు ◆ సంస్మరించె. 63

చంపకము. రతికరకంకణాంకముల ◆ రాజిలుకంఠమునందు నందమా
సతిఁగొమతీఁగెఁ బోల్కోమల ◆ సంగతి నొప్పెడువిల్లు దాల్చి యం
చితశరమాతపల్లవము ◆ చేరి చరించువసంతుచేతిలో
హితమతిఁ బెట్టి పూవిలుతుఁ ◆ డింద్రుని జేరెను గేలుమోడ్పుతోన్. 64

గద్య.

ఇది శ్రీపరమేశ్వరకరుణాకలిత లలితకవితాకలిత శ్రీరామలక్ష్మాంబా
బుచ్చివేంకయామాత్యతనూజాత సకలసజ్జనవిధేయ ఆదిపూడి
సోమనాథనామధేయప్రణీతం బయినయాంధ్రకుమార
సంభవమునందు బ్రహ్మసాక్షాత్కార
మనుద్వితీయాశ్వాసము.





శ్రీ

# కుమారసంభవమ్.



## తృతీయస్సర్గః.



తస్మిన్ మఘోన స్త్రిదశాన్ విహాయ సహస్ర మక్ష్ణాం యుగపత్ పపాత,
ప్రయోజనాపేక్షితయా ప్రభూణాం, ప్రాయ శ్చలం గౌరవ మాశ్రితేషు॥ 1
స వాసవే నాసనసన్నికృష్ట మితో నిషీ దేతి విసృష్టభూమిః
భర్తుః ప్రసాదం ప్రతిగృహ్య మూర్ధ్నా వక్తుం మిథః ప్రాక్రమ తైవ మేనమ్॥ 2
ఆజ్ఞాపయ జ్ఞాతవిశేష పుంసాం లోకేషు యత్ తే కరణీయ మస్తి?
అనుగ్రహం సంస్మరణప్రవృత్త మిచ్ఛామి సంవర్ధిత మాజ్ఞయా తే॥ 3
కే నాభ్యసూయా పదకాఙ్క్షిణా తే నితా న [illegible] తపోభిః ?

స్య నిదేశవర్తీ॥ 4

ప్రపన్నః ?

త్మైః॥ 5

స్తే

ప్రవృద్ధః ? 6

పరివిష్టాం

బాహుమ్॥ 7

వధూతః ?

శరీరమ్॥ 8

రారిః

భ్యాః ? 9



శ్రీ

# కుమారసంభవము.



## తృతీయాశ్వాసము.



### గీతములు.

వజ్రిమాపులు వేయియు ♦ వదలిసురల, వచ్చి మరుపయి నొక్కట ♦ వాలెనపుడు
ప్రభులకుఁ బ్రయోజనముఁబట్టి ♦ ప్రాయికముగ, గౌరవంబాశ్రితులయందు ♦ మాఱుఁగా దె.
తనదుసింహాసనము చెంతఁ ♦ దావు చేసి, యిచటఁ గూర్చుండు మని తెల్పి ♦ నింద్రుదయను
నొదలఁ గ్రహించి కాముఁ డే ♦ కాంతమందు, శక్రుతో నిట్లు పల్కెను ♦ పక్రిమించె.
పురుషబలతారతమ్యమ్ము ♦ లెఱుఁగు దీవు, తెలుపు జగముల నే నేమి ♦ సలుపవలయుఁ
దలఁచి నాయందుఁ జూపిన ♦ దయను నీదు, నాజ్ఞచేఁ బెంపవేఁడెద ♦ సమరవర్య! 3
ఎవఁడు దీర్ఘతపంబున ♦ నింద్రపదవిఁ, గోరి నీకు నసూయను ♦ గొలిపెఁ జెపుమ
శరము గూర్చినయీ నాదు ♦ చాపమునకు, గురిగఁ జేసెద నాతనిఁ ♦ గులిశపాణి. 4
ఎవఁడు నీయొప్పిదము లేక ♦ భవభయమున, ముక్తిమార్గము గొనెఁ జెల్పు ♦ పూనివానిఁ
జిత్రముగను బొమల్ద్రిప్పి ♦ చెలఁగుసతుల, యోరచూపుల బంధించి ♦ యుంతుఁ జిరము.
నీరిపు వెవండు? శుక్రుచే ♦ నీతినేర్చి, క్రాలునేనియు విషయరా ♦ గమ్ము గొలిపి
వానిధర్మార్థములు రెండు ♦ వ్రచ్చివైతు, వరద యేటిలటమ్ముల ♦ వ్రచ్చునట్లు. 6
తనసొబగుచేత నీదుడెం ♦ దమును గలఁచు, దృఢపతివ్రత గలదేని ♦ తెలుపు తాసె
సిగ్గు విడనాడి భుజముల ♦ చేత నిన్ను, గౌగలింపంగఁ జేసెదఁ ♦ గాంక్ష దీర. 7
కాముకులతప్పిదముచేసి ♦ కాళ్లఁ బడిన, నిన్ను నెవ్వతె కనలి మ ♦ న్నింపకుండు
దానిఁ జేసెదఁ దాపసం ♦ తప్త గాఁగఁ, దలిరుసెజ్జకు శరణొందు ♦ దానిఁ గాఁగ.
విశ్రమించుత వజ్రమ్ము ♦ వీరవర్య!, మచ్ఛరంబుల భుజవీర్య ♦ మహిమ చెడని
దేవరిపుఁ డేఁడి? యలుకకె ♦ మ్మొవు లదరు, స్త్రీలకునుగూడ భయపడఁ ♦ జేయువాఁడ.

తవ ప్రసాదాత్ కుసుమాయుధోపి సహాయ మేకం మధు మేవ లబ్ధ్వా
కుర్యాం హర స్యాపి పినాకపాణేః ధైర్య చ్యుతిం ; కే మమ ధన్వినోన్యే ? 10

అథోరుదేశా దవతార్య పాద మాక్రాన్తి సంభావితపాదపీఠం
సంకల్పితార్థే వివృతాత్మశక్తి మాఖణ్డలః కామ మిదం బభాషే॥ 11

సర్వం సఖే త్వ య్యుపపన్న మేత దుభే మ మాస్త్రే కులిశం భవాం శ్చ
వజ్రం తపోవీర్యమహత్సు కుణ్ఠం, త్వం సర్వతోగామి చ సాధకం చ॥ 12

అవైమి తే సార, మతః ఖలు త్వాం కార్యే గురుణ్యాత్మసమం నియోక్ష్యే;
వ్యాదిశ్యతే భూధరతా మవేక్ష్య కృష్ణేన దేహోద్వహనాయ శేషః॥ 13

ఆశంసతా బాణగతిం వృషాఙ్కే కార్యం త్వయా నః ప్రతిపన్నకల్పం,
నిబోధ యజ్ఞాంశభుజా మిదానీ ముచ్చై ర్ద్విషా మీప్సిత మేత దేవ॥ 14

అమీ హి వీర్యప్రభవం భవస్య జయాయ సేనాన్య ముశన్తి దేవాః,
స చ త్వదేకేషునిపాతసాధ్యో బ్రహ్మాఙ్గభూ ర్బ్రహ్మణి యోజితాత్మా॥ 15

తస్మై హిమాద్రేః ప్రయతాం తనూజాం యతాత్మనే రోచయితుం యతస్వ
యోషిత్సు తద్వీర్యనిషేకభూమిః సైవ క్ష మే త్యాత్మభు వోపదిష్టమ్॥ 16

గురో ర్నియోగా చ్చ నగేన్ద్రకన్యా స్థాణుం తపస్య న్త మధిత్యకాయామ్
అన్వాస్త ఇ త్యప్సరసాం ముఖేభ్యః శ్రుతం మయా మత్ప్రణిధిః సవర్గః॥ 17

త ద్గచ్ఛ సిద్ధ్యై, కురు దేవకార్య, మర్థోయ మర్థాన్తరభావ్య ఏవ,
అపేక్షతే ప్రత్యయ ముత్తమం త్వాం బీజాఙ్కురః ప్రా గుదయా దివామ్భః॥18

తస్మిన్ సురాణాం విజయాభ్యుపాయే త వైవ నా మాస్త్రగతిః, కృతీ త్వమ్,
అ ప్యప్రసిద్ధం యశసే హి పుంసా మనన్యసాధారణ మేవ కర్మ॥ 19

సురాః సమభ్యర్థయితార ఏతే, కార్యం త్రయాణా మపి విష్టపానామ్,
చాపేన తే కర్మ, న చాతిహింస్ర, మహో బ తాసి స్పృహణీయవీర్యః॥ 20

మధు శ్చ తే మన్మథ సాహచర్యా దసా వనుక్తోపి సహాయ ఏవ;
సమీరణో నోదయితా భ వేతి వ్యాదిశ్యతే కేన హుతాశనస్య? 21

త థేతి శేషా మివ భర్తు రాజ్ఞా మాదాయ మూర్ధ్నా మదనః ప్రతస్థే;
ఐరావతాస్ఫాలనకర్కశేన హస్తేన పస్పర్శ తదఙ్గ మిన్ద్రః॥ 22

నేను గుసుమాయుధుఁడ నయ్యు ♦ నీదుకరుణ, నొకవసంతునితోఁ గూడి ♦ యుంటినేని
చేతను బినాక మిడువాని ♦ చేవ సైనఁ, జెఱతు ననఁ దక్కువిలుకాండ్రఁ ♦ జెప్ప నేల?

అనుడుఁ దొడమీఁదికా ల్దీసి ♦ యమరవరుఁడు, పాదపీఠముమీఁదను ♦ వఱలఁ జేసి
స్వీయసామర్థ్య మట్టులు ♦ చెప్పికొనిన, భావభవుతోడ నిట్టులు ♦ పల్కఁదొడఁగె.

నీవు చెప్పిన దంతయు ♦ నీకుఁ గలదు, ఇర్వురే నాకు నస్త్రంబు ♦ లీవు పవియుఁ;
జెడును వజ్రంబు దృఢతప ♦ స్సిద్ధులందు, నెందుఁ జెడనట్టిసాధనం ♦ బీవె సఖుఁడ. 12

ఎఱుఁగనే నీదుబలము నా ♦ సరివి నీవు, గానఁ గొలుపుదు నిను మహా ♦ కార్యమందు
ధరను మోసెడువాఁ డని ♦ యెఱిఁగి చక్రి, తనతనువు దాల్ప శేషుని ♦ నునిచెఁ గాదె.

శంభుపై నల్గుఁ బఱుప్ర ♦ శంస గల్గెఁ, గాన మాకార్యమును నీవు ♦ పూని నల్లె
భగారివైరులు గలహావి ♦ ర్భుజులు వీరు, గోరుచుండెడుకోరిక ♦ గూడ నిదియె. 14

జయము గాంచంగ శివవీర్య ♦ జనితుఁ డైన, వీరసేనాని నీసురల్ ♦ గోరినారు
ఆత్మ మంత్రాత్మ యగుబ్రహ్మ ♦ మందు నిడిన, భవుఁడు వశుఁడౌను నీశర ♦ పాతమునకె.

హిమగిరి తనూజ యైనయా ♦ విమల నుమను, శివుఁడు ప్రేమించయత్నంబు ♦ సేయుమీవు
స్త్రీలలోపల నామెయే ♦ శూలితేజు, దాల్పఁ జాలిన నెలవని ♦ ధాత దెలిపె. 16

తండ్రిపంపునఁ గిరిరాజ ♦ తనయ యిపుడు, మంచుకొండను దప మొన ♦ రించుశివుని
గొలుచుచున్నది యంచు నా ♦ గూఢచార, లైనయచ్చర లెఱిఁగింపఁ ♦ గాను వింటి.

దేవకార్యంబు దీనిని ♦ దీర్పఁ జనుము, ఉమ యనెడుసాధనాంతర ♦ మున్నఁగూడ
మొలచు బీజాంకురమునకు ♦ జలముమాడ్కి, నంతిమోత్తమసాధనం ♦ బగుదు వీవె. 18

సురలకు జయంబు గలుగఁగా ♦ హరునిమీఁద, నలుగుపఱపెడునీవె కృ ♦ తార్థుఁడనఁగఁ
బూనుపనిసుప్రసిద్ధంబు ♦ కానిదైన, నన్యశక్యంబు గానిచో ♦ యశము నిడదె. 19

వేఁడుచుండెడువారలు ♦ వేల్పులంట, కార్యమో ముజ్జగమ్ముల ♦ కార్యమంట
యదియు నీవింటపై హింస ♦ యంటదంట, వింతగొల్పదె భవదీయ ♦ విక్రమంబు. 20

సహచరుఁడుగాననీకువ ♦ సంతుఁ డితఁడు, చెప్పకయెతఁసుసాయంబు ♦ చేయఁగలఁడు
మించి యగ్నిని బురికొల్పు ♦ మంచు నెవఁడు, చేరి గాలిని బ్రేరణ ♦ సేయుచుండు. 21

చిత్తమని విభునాజ్ఞను ♦ జిత్తభవుఁడు, దయ నొసంగినసరమట్లు ♦ తలను దాల్చి
తరలిపోయెను శక్రుండు ♦ సురగజమ్ముఁ, దట్టిపరుసైనకరముచేఁ ♦ దనువుసవరట. 22

స మాధవే నాభిమతేన సఖ్యా రత్యా చ సాశఙ్కమనుప్రయాతః
అఙ్గవ్యయప్రార్థితకార్యసిద్ధిః స్థాణ్వాశ్రమం హైమవతం జగామ॥ 23

తస్మిన్ వనే సంయమినాం మునీనాం తపస్సమాధేః ప్రతికూలవర్తీ
సంకల్పయోనే రభిమానభూత మాత్మాన మాధాయ మధు ర్జజృమ్భే॥ 24

కుబేరగుప్తాం దిశ ముష్ణరశ్మౌ గన్తుం ప్రవృత్తే సమయం విలఙ్ఘ్య
ది గ్దక్షిణా గన్ధవహం ముఖేన వ్యలీకనిశ్వాస మి వోత్ససర్జ॥ 25

అసూత సద్యః కుసుమా న్యశోకః స్కన్ధాత్ ప్రభృత్యేవ సపల్లవాని,
పాదేన నాపైక్షత సున్దరీణాం సంపర్క మాశిఞ్జితనూపురేణ॥ 26

సద్యః ప్రవాలోద్గమచారుపత్త్రే నీతే సమాప్తిం నవచూతబాణే,
నివేశయామాస మధు ర్ద్విరేఫాన్ నామాక్షరాణీవ మనోభవస్య॥ 27

వర్ణప్రకర్షే సతి కర్ణికారం ధునోతి నిర్గన్ధతయా స్మ చేతః,
ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః॥ 28

బాలేన్దువక్రాణ్యవికాసభావా ద్బభుః పలాశా న్యతిలోహితాని
సద్యో వసన్తేన సమాగతానాం నఖక్షతా నీవ వనస్థలీనామ్॥ 29

లగ్నద్విరేఫాఞ్జనభక్తిచిత్రం ముఖే మధుశ్రీ స్తిలకం ప్రకాశ్య
రాగేణ బాలారుణకోమలేన చూతప్రవాలోష్ఠ మలఞ్చకార॥ 30

మృగాః ప్రియాళద్రుమమఞ్జరీణాం రజఃకణై ర్విఘ్నితదృష్టిపాతాః
మదోద్ధతాః ప్రత్య నిలం విచేరు ర్వనస్థలీర్మర్మరపత్త్రమోక్షాః॥ 31

చూతాఙ్కురాస్వాదకషాయకణ్ఠః పుంస్కోకిలో యన్మధురం చుకూజ
మనస్వినీ మానవిఘాత దక్షం త దేవ జాతం వచనం స్మరస్య॥ 32

హిమవ్యపాయా ద్విశదాధరాణా మాపాణ్డురీభూత ముఖచ్ఛవీనాం
స్వేదోద్గమః కింపురుషాఙ్గనానాం చక్రే పదం పత్త్రవిశేషకేషు॥ 33

తపస్వినః స్థాణువనౌకస స్తా మాకాలికీం వీక్ష్య మధుప్రవృత్తిం
ప్రయత్న సంస్తమ్భితవిక్రియాణాం కథంచి దీశా మనసాం బభూవుః॥ 34

తం దేశ మారోపితపుష్పచాపే రతిద్వితీయే మదనే ప్రపన్నే
కాష్ఠాగత స్నేహరసానువిద్ధం ద్వన్ద్వాని భావం క్రియయా వివవ్రుః॥ 35

సతిరతియు నిష్టసఖుఁడగు ♦ ఋతుపతియును, భయముతో వెంబడింపఁగాఁ ♦ బ్రసవశరుఁడు
దేవకార్యసమర్పిత ♦ దేహుఁ డగుచు, హిమగిరిని గ్రాలుశివుని యా ♦ శ్రమముఁ జేరె. 23

తద్దయు సమాధినిష్ఠచేఁ ♦ దపము సల్పు, తపసులతపమ్మునకు విఘా ♦ తమును గొల్పు
మధువు మన్మథునకు నభి ♦ మానసఖుఁడు, పర్వెఁ దనరూపుఁ దాల్చి త ♦ ద్వనమునందు.

అక్కుబేరుఁడు రక్షించు ♦ దిక్కుఁ బోవ, ఖరకరుఁడు గాలమును దాఁటి ♦ కడఁగుచుండ
దక్షిణపుదిక్కు విడిచెను ♦ దనముఖమున, వంతనిట్టూర్పువలె గంధ ♦ వహుని నపుడు. 25

కలరవము లీనునూపుర ♦ ములను గ్రాలు, కోమలులపాదసంస్పర్శ ♦ గోరకుండ
బోదెయే యాదిగనశోక ♦ భూజమెల్లఁ, దలిరులను గూడి పూచెను ♦ దక్షిణమున. 26

చిగురుటాకులతోఁ గూడి ♦ చెన్నుమీఱు, మావినవమల్లికాపూర్ణతం ♦ బడయఁగానె
మరునియుతూరములో యన ♦ వఱలుచుండు, మధుపములఁ గూర్చె దానిపై ♦ మాధవుండు.

బాగుగా వన్నె గాంచియు ♦ గోఁగుపూవు, తద్దయును మది నొప్పించెఁ ♦ దావిలేమి
సలిష్ట ప్రాయికముగఁ దన ♦ సృష్టిలోనఁ, బూర్ణతను గూర్చిపెడమోముఁ ♦ బూనుగాదె.

విచ్చుకుండమి నెలవంక ♦ విధము గాంచి, యధికరాగంబు గనుటచే ♦ నప్పుడపుడె
కూడి యుడినవసంతుని ♦ గోటినొక్కు, లనఁగ మోదుగుననలొప్పె ♦ వనమునందు. 29

అంటి యున్నట్టి యళులను ♦ నంజనమున, ముఖమునం జిత్రతిలకంబుఁ ♦ బోలయఁ జేసి
మధురమాదేవి గూరిచె ♦ మావిచిగురు, మోవిపై బాలరవిఁ బోలు ♦ కావిరంగు. 30

ప్రేంకణపుఁబుప్పొడులచేత ♦ వీక్షణములు, చెదరఁ దిరిగెను గాలికి ♦ నెదురుగాను
బొగరుచే విఱ్ఱవీఁగెడు ♦ మృగగణములు, రాలునాకులచప్పుడుల్ ♦ గ్రాలు వనిని. 31

మావినసఁ దినఁ గంఠమ్ము ♦ జేవురించి, హాయిగా గండుఁగోయిల ♦ కూయుకూఁత
మానినులపాలయలుకను ♦ మాన్పఁజాలు, మారుఁ డాదేశమొసరించు ♦ మాట యయ్యె.

మంచు తొలఁగుడు మోవులు ♦ మించఁ దొడఁగ, వదనములఁ బాండురచ్ఛవి ♦ పర్వసాగ
నెలమితోఁ బత్త్రములలిఖి ♦ యించుకొనిరి, చిఱుచెమటగ్రమ్ముచుండఁగిం ♦ పురుషసతులు.

శూలివనిలోనిమాను ల ♦ కాలమందు, నట్లు మధువు విజృంభింప ♦ నట్టె కాంచి
కడుఁ గడఁకతోడ నణఁచి వి ♦ కారములను, నెట్టులో చిత్తముల నిగ్ర ♦ హించుకొనిరి.

అలరువిల్లెక్కువెట్టి యా ♦ యాశ్రమమును, జిత్తజన్ముండు రతితోడఁ ♦ జేరఁగానె
ద్వంద్వములు ప్రేమరసపూర ♦ భావములను, విరివిగాఁ దమచేష్టల ♦ వెల్లడించె. 35

అనుచుఁ దేటగ నగ్గౌరి ♦ మనసు నిట్లు, విమలభావంబుతోఁ జెలి ♦ విన్నవింప
దాఁచి హర్షంబు మదినిసుం ♦ దరుఁడు వటుఁడు, హాస్యమా! యిదినిజమ! యం ♦ చడిగె నుమను.

అంత స్ఫటికాక్షమాలిక ♦ నద్రిజాత, చేతిముడిచినమునివ్రేళ్ల ♦ చేతఁ దాల్చి
యెంతయో సేపటికిఁ దాను ♦ నెట్టు లెట్లొ, యతిమితమ్ముగ నిట్లుమా ♦ టాడఁదొడఁగె.

వేదవిద్వర్య! నిజము నీ ♦ విన్నదెల్ల, నుచ్చపద మందనీవ్యక్తి ♦ యిచ్ఛగించె
దాని కిది తగుతపమని ♦ తలఁచె మదిని, గోర్కి కోరనియట్టిది ♦ గూడఁ గలదె. 64

అనిన నాబ్రహ్మచారి యి ♦ ట్లనియె నుమకు, భవు నెఱుంగుదు నాతని ♦ వలచి తీవు
అతిదురాచారపరుఁడైన ♦ యతనిఁ దలఁప, ననుసరింపంగ నిను గొల్ప ♦ మనసు రాదు.

తగనిదానికిఁ బూనిన ♦ తన్వి నీవు, పరిణయపుసూత్ర మొప్పనీ ♦ కరము మొదట
నురగకంకణమును దాల్చు ♦ హరుఁడు పట్ట, నెట్లుగానోర్చియుందువో ♦ యెఱుఁగరాదు.

వధువు రాయంచపూవుల ♦ వలిపెమునకు, నిరతమును రక్తబిందులఁ ♦ గురియునట్టి
హస్తిచర్మంపుఁగూడిక ♦ యర్హమేమొ, చక్కఁగా నీవె యోచింపు ♦ న్యాయముగను.

పొలుచు చవికెలఁ బఱచిన ♦ పూలనిడెడు, లక్కరస మొప్పునీపాద ♦ లాంఛనముల
శవశిరోజాళి చెదరుశ్మ ♦ శానములను, జాన చూడంగ నొప్పునే ♦ శత్రువైన. 68

కలుగు సులువుగ ముక్కంటి ♦ కౌఁగిలింత, కాని గంధముపూయుచ ♦ న్నవను నీకు
నెలకొను బరేతభస్మంబు ♦ నెలఁతమిన్న, యింతకంటె నయుక్త మిం ♦ [illegible]

మొదలె యిరికొకనగుఁబాటు ♦ పాడము నీకు, మదగజేంద్రమ్ము [illegible] ♦ [illegible]
పెండ్లికూఁతుర వై వృద్ధ ♦ వృషభ మెక్కఁ, జూచువారెల్ల నవ్వరె ♦ సుందరాంగి. 70

కరమునఁ బినాక మిడునట్టి ♦ హరునిపొందు, గోరి యిపు డిర్వురే జాలి ♦ గొలుపువారు
ప్రజలకంటికి వెన్నెలఁ ♦ బఱపి వెలయు, నొకటి యాచందురునిరేఖ ♦ యొకతె నీవు.

కాయమో వికారమైనట్టి ♦ కనులు గలది, తెలియరానిది జన్మంబు; ♦ దిస్సమొలయె
చెప్ప సిరులను ముక్కంటి ♦ చెంత వరుని, యొక్కగుణమైన నున్నదే ♦ యోమృగా[illegible].

మఱిని మరలింపు మీదురీ ♦ ప్సితమునుండి, పూత నీ వేడ యట్టికా ♦ పురుషుఁ డేడ
యూపమున కెట్టు లట్లు వే ♦ దోక్తపూజ, సలుపుదురె కాటికొయ్యకు ♦ సత్పురుషులు. 73

ఇతి ద్విజాతౌ ప్రతికూలవాదిని, ప్రవేపమానాధరలక్ష్యకోపయా
వికుఞ్చితభ్రూలత మాహితే తయా విలోచనే తిర్య గుపాన్తలోహితే॥ 74

ఉవాచ చైనమ్.—పరమార్థతో హరం న వేత్సి నూనం యత ఏవ మాత్థ మామ్
అలోకసామాన్య మచిన్త్యహేతుకం ద్విషన్తి మన్దా శ్చరితం మహాత్మనామ్॥ 75

విపత్ప్రతీకారపరేణ మఙ్గలం నిషేవ్యతే భూతిసముత్సుకేన వా ;
జగచ్ఛరణ్యస్య నిరాశిషః సతః కి మేభి రాశోపహతాత్మవృత్తిభిః ? 76

అకిఞ్చనః సన్ ప్రభవ స్స సంపదాం, త్రిలోకనాథః పితృసద్మగోచరః,
స భీమరూపః శివ ఇ త్యుదీర్యతే, నసన్తి యాథార్థ్యవిదః పినాకినః॥ 77

విభూషణోద్భాసి పినద్ధభోగి వా, గజాజినాలమ్బి దుకూలధారి వా
కపాలి వా స్యా, దథ వేన్దుశేఖరం, న విశ్వమూర్తే రవధార్యతే వపుః॥ 78

తదఙ్గసంసర్గ మవాప్య కల్పతే ధ్రువం చితాభస్మరజో విశుద్ధయే ;
తథా హి నృత్యాభినయక్రియాచ్యుతం విలిప్యతే మౌలిభి రమ్బరౌకసామ్॥ 79

అసంపద స్తస్య వృషేణ గచ్ఛతః ప్రభిన్నదిగ్వారణవాహనో వృషా
కరోతి పాదా వుపగమ్య మౌలినా వినిద్ర మన్దార రజోరుణాఙ్గులీ॥ 80

వివక్షతా దోష మపి చ్యుతాత్మనా త్వయైక మీశం ప్రతి సాధు భాషితమ్,
య మామన న్త్యాత్మభువోపి కారణం. కథం స లక్ష్యప్రభవో భవిష్యతి? 81

అలం వివాదేన, యథా శ్రుత స్త్వయా, తథావిధ స్తావ దశేష మస్తు సః ;
మమాత్ర భావైకరసం మనః స్థితం; న కామవృత్తి ర్వచనీయ మీక్షతే॥ 82

నివార్యతా మాలి, కి మ ప్యయం వటుః పున ర్వివక్షుః స్ఫురితోత్తరాధరః;
న కేవలం యో మహతో పభాషతే శృణోతి తస్మా దపి యః స పాపభాక్॥ 83
ఇతో గమి ష్యామ్యథ వేతి వాదినీ చచాల బాలా స్తనభిన్నవల్కలా ;
స్వరూప మాస్థాయ చ తాం కృతస్మితః సమాలలమ్బే వృషరాజకేతనః॥ 84
తం వీక్ష్య వేపథుమతీ సరసాఙ్గయష్టి ర్నిక్షేపణాయ పద ముద్ధృత ముద్వహన్తీ,
మార్గాచలవ్యతికరాకులి తేవ సిన్ధుః శైలాధిరాజతనయా న యయౌ న తస్థౌ॥ 85

బ్రాహ్మణుం డప్రియంబిట్లు ♦ పలుకుటయును, నామెకోపమ్ము చేమోవి ♦ యదరుచుండ
నెంతయును నేత్రములకొన ♦ లెఱ్ఱవాఱ, బొమలు ముడివడఁ గాఁ బెడ ♦ మోము వెట్టె.

మఱియు నీరీతి నతనితో ♦ మాఱు వలికె, భవుని నిజరూప మెఱుఁగమిఁ ♦ బలికితిట్లు
అతులము దురూహ్యమైన మ ♦ హాత్మ్యచరిత, మందు లెఱుఁగక ద్వేషించు ♦ చుందురిలను.

పలుసిరుల నంద మఱియు వి ♦ పత్తు డింద, మంగళమ్ముల సేవింత్రు ♦ మహిని జనులు
పెంచి కోర్కెల మతిఁ బాపు ♦ వీని నెట్టు, లాశయే లేనిరక్షకుం ♦ డతఁడు గోరు. 76

బీదవాఁ డయ్యు సంపదల్ ♦ పిదుకుచుండుఁ, గాటిలోనుండియు జగమ్ముఁ ♦ గాచుచుండు
భీముఁ డయ్యును శివుఁ డయి ♦ వెలుఁగుచుండు, భవుని నిజరూప మెఱిఁగిన ♦ వారుగలరె.

నాగుఁబాముల నొండెను ♦ నగల నొండె, వారణాజిన మొండె దు ♦ వ్వలువ యొండె
బునుక యొండెను జంద్రుని ♦ తునక యొండెఁ, దాల్చు విశ్వస్వరూపుని ♦ దర మెఱుఁగ.

ఆమహేశ్వరు ననంగంబు ♦ నంటఁగానె, పూత మాచుండుఁ జితిలోని ♦ భూతి నిజము
శూలి తాండవమాడఁగా ♦ రాలుధూళిఁ, దమిని దేవత లౌదలఁ ♦ దాల్త్రి గాదె. 79

మత్తదిగ్వారణం బెక్కి ♦ పొదలు వజ్రి, వృషభ మెక్కెడు నట్టియా ♦ బీదఁ జేరి
యతని పదములఁ దలవంచి ♦ యంగుళులకు, వఱలు మందార రజముచే ♦ నెఱుపుఁ గొలుపు.

దుష్టమతి వయి దూషింపఁ ♦ దొడఁగి శివుని, నొప్పఁ బల్కితి వభవుఁడం ♦ చొకట మాట
యజునకును గూడఁ గారణం ♦ బితఁడె యనఁగ, నింక నితనికిఁ గారణం ♦ బెఱుఁగ నగునె.

వలదు వాదంబు చాలును ♦ వలదు వలదు, అతఁడు నీ చెప్పినట్టులే ♦ యగును గాక
స్వాంత మాతనిభావర ♦ సంబె మరగె, స్వేచ్ఛఁ జనువారు సడి లెక్క ♦ సేయరుగద.

మరల మాటాడఁ బోయెడు ♦ మాడ్కి వటుఁడు, సకియరో! మోవియాడించెఁ ♦ జాలుననుము
పరమపూజ్యుల నిందించు ♦ వారె గాక, వినెడువారును బాపంబు ♦ గొనుదు రంద్రు.
పోని యిటనుండి పోయెద ♦ నేనె యంచు, బాల పోఁజొచ్చెఁ బాలిండ్ల ♦ పైఁట జాఱ
నంత వృషరాజకేతనుం ♦ డద్రితనయ, హస్తమును బట్టె నిజరూప ♦ మంది నగుచు. 84
అతనిఁ గని కంపమంది దే ♦ హము చెమర్పఁ, బెట్టఁ బోనున్న పాదంబుఁ ♦ బెట్టకుండ
నడ్డముగ నదిరి వచ్చిన ♦ నలఁతపడెడు, నేటివలెఁ బోక నిలువక ♦ యుంటి యుండె. 85

'అద్య ప్రభృ త్యవనతాఙ్గి, త వాస్మి దాసః క్రీతస్తపోభి' రితివాదినిచన్ద్రమౌళౌ,
అహ్నాయ సా నియమజం క్లమ ముత్ససర్జ క్లేశః ఫలేన హి పున ర్నవతాంవిధత్తే॥

ఇతి శ్రీకాలిదాసకృతౌ కుమారసంభవే మహాకావ్యే తపః
ఫలోదయో నామ పఞ్చమస్సర్గః.



నేఁడు మొదలుగఁ జెలువరో ◆ నీకు నేను, వ్రతములకు నమ్మఁబడిన సే◆వకుఁడనంచు
యీశుఁ డనఁగానె తత్తప◆క్లేశ మెడలె, శ్రమముగాఁ దోఁచు నేశ్రమ◆సఫల మైన"

## గద్య.

ఇది శ్రీపరమేశ్వరకరుణాకలిత లలితకవితాకలిత శ్రీరామలక్ష్మాంబా
బుచ్చివేంకయామాత్యతనూజాత సకలసజ్జనవిధేయ ఆదిపూడి
సోమనాథనామధేయప్రణీతం బయిన గాంధర్వకుమార
సంభవమునందుఁ దపఃఫలోదయం
బను పంచమాశ్వాసము.





శ్రీ

# కుమారసంభవమ్.



## షష్ఠస్సర్గః.



అథ విశ్వాత్మనే గౌరీ సందిదేశ మిథః సఖీం,
'దాతా మే భూభృతాం నాథః ప్రమాణీక్రియతామి' తి॥ 1
తయా వ్యాహృతసందేశా సా బభౌ నిభృతా ప్రియే
చూతయష్టి రివాభ్యాసే మధౌ పరభృతోన్ముఖీ॥ 2
స తథేతి ప్రతిజ్ఞాయ, విసృజ్య కథ మప్యుమామ్
ఋషీన్ జ్యోతిర్మయాన్ సప్త సస్మార స్మరశాసనః॥ 3
తే ప్రభామణ్డలై ర్వ్యోమ ద్యోతయన్త స్తపోధనాః
సారున్ధతీకాః సపది ప్రాదురాసన్ పురః ప్రభోః॥ 4
ఆప్లుతా స్తీరమన్దారకుసుమోత్కిరవీచిషు
వ్యోమగఙ్గాప్రవాహేషు దిఙ్నాగమదగన్ధిషు॥ 5
ముక్తాయజ్ఞోపవీతాని బిభ్రతో హైమవల్కలాః
రత్నాక్షసూత్రాః, ప్రవ్రజ్యాం కల్పవృక్షా ఇవాశ్రితాః॥ 6
అధఃప్రస్థాపితాశ్వేన సమావర్జితకేతునా
సహస్రరశ్మినా సాక్షాత్ సప్రణామ ముదీక్షితాః॥ 7
ఆసక్తబాహులతయా సార్ధ ముద్ధృతయా భువా
మహావరాహదంష్ట్రాయాం విశ్రాన్తాః ప్రలయాపది॥ 8
సర్గశేషప్రణయనా ద్విశ్వయోనే రనన్తరం
పురాతనాః పురావిద్భి ర్ధాతార ఇతి కీర్తితాః॥ 9





# కుమారసంభవము.



## షష్ఠాశ్వాసము.



### గీతములు.

నన్ను మీ కిచ్చు దాతగా ◆ నన్నగేంద్రు, నెంతయును ముఖ్యముగ మీర ◆ లెన్నవలయు
మనుచుఁ జెలిచేత సందేశ ◆ మద్రితనయ, యంపె విశ్వాత్మునకు రహ ◆ స్యమ్ముగాను.
అటు సఖిచేత సందేశ ◆ మందఁ జేసి, యెంతయును బ్రేమఁ బ్రియు చెంత ◆ నెసఁగె గౌరి
సఖి పికాంగన గూయ వ ◆ సంతుకడను, గూర్మి నొప్పెడు నెలమావి ◆ కొమ్మ మాడ్కి.
అట్లె యౌఁగాక యని స్మర ◆ హరుఁడు దెలిపి, యెంతయో కష్టమునను మా ◆ కాంతవీడి
యమితతేజస్స్వరూపు లై ◆ యలరుచుండు, సప్తఋషులను మదిలోన ◆ సంస్మరించె. 3
కాంతిపుంజముచేత నా ◆ కాశమెల్లఁ, దళతళ వెలుంగ నాతపో ◆ ధనులు మునులు
సతియరుంధతితోఁ గూడ ◆ సత్వరముగ, నాప్రభువు మ్రోలఁ బ్రత్యక్ష ◆ మై నిలిచిరి. 4
జిందుతటకల్పసుమములఁ ◆ జిమ్మెనలల, దిగిభమదగంధములఁ దాల్చి ◆ తేజరిల్లు
నభ్రగంగానదీప్రవా ◆ హములయందు, నెలమితో స్నాన మొనరించి ◆ యొసఁగువారు.
ఆణిముత్యాలజందెమ్ము ◆ లమలకనక, వల్కలమ్ములు మణులతా ◆ వళము లూని
పూతవన్యాశ్రమము దాల్చి ◆ పొదలుచుండు, కల్పవృక్షమ్ములట్టులు ◆ గ్రాలువారు. 6
వడిగ గుజ్జమ్ములను గ్రింద ◆ నడుపుచుండి, పయిని తముఁ జూచి పెక్కమ్ము ◆ వంచి భక్తి
స్వయముగా వేఁడివేవెల్గు ◆ వందనమ్ము, సలుపుచుండఁగ నెంతయుఁ ◆ జెలఁగువారు. 7
ప్రళయమున బాహులతచేతఁ ◆ బట్టికొనుడు, లేవనెత్తంగఁబడినభూ ◆ దేవిగూడి
తోరపువరాహమూర్తిదా ◆ కోరమీఁద, నెన్నఁగాఁగాని విశ్రాంతిఁ ◆ గొన్నవారు. 8
సృష్టి సృజియింప మిగిలిన ◆ సృష్టినెల్ల, నెంతయును బూర్తి సేసిన ◆ హేతువునను
దముఁ బురాణర్షులటంచు ◆ తనవిధాత, లనుచుఁ గీర్తించుచుండఁగా ◆ నలరువారు.
9

ప్రాక్తనానాం విశుద్ధానాం పరిపాక ముపేయుషాం
తపసా ముపభుఞ్జానాః ఫలా న్యపి తపస్వినః॥

తేషాం మధ్యగతా సాధ్వీ పత్యుః పాదార్పితేక్షణా
సాక్షా దివ తపస్సిద్ధి ర్బభాసే బహ్వరుంధతీ॥

తా మగౌరవభేదేన మునీం శ్చాపశ్య దీశ్వరః ;
స్త్రీ పుమా నిత్యనాస్థైషా, వృత్తం హి మహితం సతామ్॥

తద్దర్శనాద భూ చ్ఛంభో ర్భూయాన్ దారార్థ మాదరః,
క్రియాణాం ఖలు ధర్మ్యాణాం సత్పత్న్యో మూలకారణమ్॥

ధర్మే ణాపి పదం శర్వే కారితే పార్వతీం ప్రతి,
పూర్వాపరాధభీతస్య కామ స్యోచ్ఛ్వసితం మనః॥

అథ తే మునయః సర్వే మానయిత్వా జగద్గురుమ్
ఇద మూచు రనూచానాః ప్రీతికణ్టకితత్వచః॥

య ద్బ్రహ్మ సమ్య గామ్నాతం, య దగ్నౌ విధినా హుతం,
య చ్చ తప్తం తప, స్తస్య విపక్వం ఫల మద్య నః॥

య దధ్యక్షేణ జగతాం వయ మారోపితా స్త్వయా
మనోరథ స్యావిషయం మనోవిషయ మాత్మనః॥

యస్య చేతసి వర్తేథాః స తావత్కృతినాం వరః,
కిం పున ర్బ్రహ్మయోనే ర్యస్తవ చేతసి వర్తతే ?

సత్యమర్కాచ్చ సోమాచ్చ పర మధ్యాస్మహే పదమ్
అద్య తూచ్చైస్తరం తాభ్యాం స్మరణానుగ్రహా త్తవ॥

త్వత్సంభావిత మాత్మానం బహు మన్యామహే వయమ్ ;
ప్రాయః ప్రత్యయ మాధత్తే స్వగుణే షూత్తమాదరః॥

యా నః ప్రీతి ర్విరూపాక్ష, త్వదనుధ్యానసంభవా,
సా కి మావేద్యతే తుభ్య? మన్తరాత్మాసి దేహినామ్॥

సాక్షా ద్దృష్టోసి, న పున ర్విద్మ స్త్వాం వయ మఞ్జసా ;
ప్రసీద కథ యాత్మానం ; న ధియాం పథి వర్తసే॥

జన్మజన్మాంతరములందు ♦ సల్పినట్టి, పావనము లైనతపములు ♦ పక్వదశను
గన్నఁ దత్ఫలములఁ గాంచు ♦ చున్నఁగూడఁ, దపము లింకను జేయుచుఁ ♦ దనరువారు.

ఋషులు ప్రత్యక్షమైరి యా ♦ ఋషులనడుమఁ, బతిపదమ్ములఁ జూపులఁ ♦ బఱుపుచుండి
కేవలతపఃఫలంపుటా ♦ కృతిగ నుండు, గరిత యైనయరుంధతి ♦ కరము మెఱసె. 11

ఆమెను మునీంద్రులను గూడ ♦ నాహరుండు, గారవించెను భేదంబు ♦ గనుపఱుపక
స్త్రీపురుషతారతమ్యంబు ♦ చేతఁ గాక, చరితఁ బట్టియె పూజింతు రీ ♦ సాధుజనులు.

ఆసతిని జూడఁగానె యా ♦ హరునిమదికి, నతిశయిల్లె భార్యకోఱ్కైన ♦ యాదరమ్ము
ధర్మకార్యార్థములకెల్లఁ ♦ దావలములు, గరిత లైనట్టిపత్నులే ♦ కారె జగతి. 13

పార్వతినిగూర్చి పాదంబు ♦ శర్వుఁ డిట్లు, ధర్మమార్గానఁ బెట్టంగఁ ♦ దలఁపఁగానె
తొంటియపరాధభీతిని ♦ దొలఁగి మదిని, మారుఁడును గూడ నెంతయు ♦ నూరడిల్లె. 14

అంత వేదప్రవక్తలై ♦ యలరుచుండు, ఋషివరేణ్యులు హృదయసం ♦ ప్రీతితోడఁ
బులకరింపంగ నంగముల్ ♦ భువనగురుని, భక్తిఁ బూజించి యిట్లని ♦ పలికిరపుడు. 15

చక్కఁగా వేదపాఠంబు ♦ సలిపినట్టి, విధికి ననుకూలముగ నగ్ని ♦ వ్రేల్చినట్టి
యెంతయుఁ దపమ్ములను దపి ♦ యించినట్టి, యెల్ల మాకోరికెలు ఫలి ♦ యించె నేఁడు.

ముజ్జగంబులప్రభువయి ♦ పాలుచుదేవ, యిచ్ఛలకు తావుగాని నీ ♦ హృదయమందు
నెలకొనఁగఁ జేసితివి మమ్ము ♦ నెలమిఁ గాన, నెల్ల మాకోరికలు ఫలి ♦ యించె నేఁడు.

ఎవనిహృదయంబునం దుండు ♦ దీవు వారె, ధన్యతము లయి జగతిని ♦ దనరుచుండ్రు
వేదకారణమూర్తి వై ♦ వెలయునీదు, హృదయమం దుండువారల ♦ నెన్నఁ దరమె.

సత్యముగ సూర్యుకంటెను ♦ జంద్రుకంటెఁ, బైపదంబున నెలకొన్న ♦ వార మయ్య
నీవు స్మరియించి కరుణింప ♦ నిపుడు దేవ, పడయఁగన్నార మంతకుఁ ♦ బైపదంబు. 19

గౌరవము నీవుచూపిన ♦ కతన మమ్ము, నెంచుకొన్నార మెంతయు ♦ నెక్కువగను
గొప్పవా రాదరించిన ♦ యప్పుడె గద, స్వగుణముల నమ్మకము గల్గుఁ ♦ బ్రాయికముగ.

ఓవిరూపాక్ష నీవు నీ ♦ యుల్లమందు, మమ్ముఁ దలఁచినయప్పుడు ♦ మామనములఁ
గన్న యానందమును మేము ♦ విన్నవింప, వలయునే యంతరాత్మవై ♦ వెలయు నీకు.

నీవు ప్రత్యక్షముగ నున్న ♦ నిక్కమరయ, నీస్వరూపంబు దెలియంగ ♦ నేరమయ్య!
గానఁ గరుణించి చెప్పుము ♦ దానిమాకు, బుద్ధికి నగోచరుండవు ♦ బోధపడవు. 22

తే చాకాశ మసిశ్యామ ముత్పత్య పరమర్షయః
ఆసేదు రోషధిప్రస్థం మనసా సమరంహసః॥ 36

అలకా మతివా హ్యైవ వసతిం వసుసంపదాం
స్వర్గాభిష్యన్దవమనం కృత్వే వోపనివేశితమ్॥ 37

గఙ్గా స్రోతఃపరిక్షిప్తం వప్రా న్తర్జ్వలితౌషధి
బృహన్మణిశిలాసాలం గుప్తా వపి మనోహరమ్॥ 38

జితసింహభయా నాగా యత్రాశ్వా బిలయోనయః,
యక్షాః కింపురుషాః పౌరా, యోషితో వనదేవతాః॥ 39

శిఖరాసక్త మేఘానాం వ్యజ్యన్తే యత్ర వేశ్మనామ్
అనుగర్జితసందిగ్ధాః కరణై ర్మురజస్వనాః॥ 40

యత్ర కల్పద్రుమై రేవ విలోలవిటపాంశుకైః
గృహయన్త్రపతాకాశ్రీ రపౌరాదరనిర్మితా॥ 41

యత్ర స్ఫటికహర్మ్యేషు నక్త మాపానభూమిషు
జ్యోతిషాం ప్రతిబిమ్బాని ప్రాప్నువ న్త్యుపహారతామ్॥ 42

యత్రౌషధిప్రకాశేన నక్తం దర్శితసంచరాః
అనభిజ్ఞా స్తమిస్రాణాం దుర్దినే ష్వభిసారికాః॥ 43

యౌవనాన్తం వయో యస్మిన్, నాతఙ్కః కుసుమాయుధాత్,
రతిఖేదసముత్పన్నా నిద్రా సంజ్ఞావిపర్యయః॥ 44

భ్రూభేదిభిః సకమ్పోష్ఠై ర్లలితాఙ్గులితర్జనైః
యత్ర కోపైః కృతాః స్త్రీణా మాప్రసాదార్థినః ప్రియాః॥ 45

సంతానకతరుచ్ఛాయాసుప్త విద్యాధరాధ్వగం
యస్య చోపవనం బాహ్యం గన్ధవ ద్గన్ధమాదనమ్॥ 46

అథ తే మునయో దివ్యాః ప్రేక్ష్య హైమవతం పురం
స్వర్గాభిసన్ధిసుకృతం వఞ్చనా మివ మేనిరే॥ 47

తే సద్మని గిరే ర్వేగా దున్ముఖ ద్వాఃస్థ వీక్షితాః
అవతేరు ర్జటాభారై ర్లిఖితానలనిశ్చలైః॥ 48

వెంటనే మునితతి మనో ♦ వేగ మొప్ప, కత్తివలె నల్లనైనయా ♦ కాశమునకు
నెగసి పఱతెంచి చేరెను ♦ హిమగిరీంద్రు, నోషధిప్రస్థ మనుపేర ♦ నొప్పుపురము. 36

సంపదల కాలవాల మై ♦ సొంపునింపు, నలకపురిc దెచ్చి పెట్టిన ♦ యలరునట్లు
స్వర్గమునునిండి మిగిలిన ♦ జనముచేత, వలస గొల్పింపcబడినట్లు ♦ వెలయుదాని. 37

చుట్టు గంగాప్రవాహముల్ ♦ ముట్టి యుండc, గోటలో నోషధుల దీప ♦ కోటి వెలుcగ
గొప్పరత్నాలచే వప్ర ♦ కుడ్య మొప్ప, నెంతయు మనోహరం బయి ♦ యొసcగుదాని.

సింగములc గని వెఱవని ♦ సింధురములు, వరబిలమ్ములc బుట్టిన ♦ వారువములు
పురజనమ్ములు యక్షకిం ♦ పురుషవరులు, స్త్రీలు వనదేవతలు గల్గి ♦ చెలcగుదాని.39

మేడలకు నంటి మేఘముల్ ♦ మెలగుచుంట, నురుము ప్రతిరవమో యని ♦ వరమృదంగ
నినదమును సంశయించెడు ♦ జనుల కెపుడుc, దేటcగాcడాళములచేతc ♦ దెలుపుదాని.

ప్రజకు యంత్రాలచే నిండ్ల ♦ ధ్వజము లెత్తు, శ్రమయె లేకుండ నాసొంపు ♦ నమరతరుల
సంచలించెడు కొమ్మల ♦ మించుచుండు, వలిపములు నింప నెంతయు ♦ వఱలుదాని.41

పానభూములయందును ♦ బటికపుటాల, మేడలందును రాత్రుల ♦ మింట నుండి
ప్రతిఫలించెడు చుక్కలు ♦ ప్రసవములుగ, ముత్తెములుగను పెల్లగాc ♦ బొదలుదాని.

మబ్బుగమ్మినరాత్రుల ♦ మార్గములను, నోషధులకాంతు లెంతయు ♦ నొప్పమీఱc
గనుపఱచుచుండ నభిసారి ♦ కాగణమ్ము, తమము నెఱుcగకయుండcగాc ♦ దనరుదాని.

యౌవనము గాకయుండు ప్రా ♦ యమ్ము గాని, యసమశరునకు మించిన ♦ యముcడు గాని
రతిc బడలి కన్ననిద్రకు ♦ నతిశయించు, నిదురయే కాని లేకుండ ♦ నెగడుదాని. 44

బొమలు ముడివడియుండc గో ♦ మ్మావి యదర, మృదుతరంబగు వ్రేలిచే ♦ బెదరుగొలుపు
కనలుగొన్నట్టికాంతలు ♦ కనికరించు, వఱకు వేcడెడుప్రియులచే ♦ వఱలుదాని. 45

పాంథవిద్యాధరులు చేరి ♦ పవ్వళింప, ఛాయ లొసcగెడుకల్పవృ ♦ క్షములు గలిగి
తావులను జిమ్ము గంధమా ♦ దననగంబె, యుపవనంబుగ నలరారు ♦ చుండుదాని. 46

హిమగిరీంద్రునినగరంబు ♦ నెలమితోడc, గనులవిందుగ నాదేవ ♦ మునులు గాంచి
సురపురము గూర్చి చేసిన ♦ సుకృతములను, వంచకము లంచు మనముల ♦ నెంచి రపుడు.

చిత్తరువులోనిమంటల ♦ చెన్ను దోcప, నిలిచి వెలిగెడుజడలతో ♦ నలరుమునులు
ద్వారపాలురు వో మెత్తి ♦ తమ్ముcజూడ, వడిగ హిమవంతునింటిలో ♦ పలికి దిగిరి.48

గగనా దవతీర్ణా సా యథావృద్ధపురస్సరా
తోయాన్తర్భాస్కరా లీవ రేజే మునిపరమ్పరా॥

తా నర్ఘ్యా నర్ఘ్య మాదాయ దూరాత్ ప్రత్యుద్యయౌ గిరిః
నమయన్ సారగురుభిః పాదన్యాసై ర్వసున్ధరామ్॥

ధాతుతామ్రాధరః ప్రాంశు ర్దేవదారుబృహద్భుజః
ప్రకృత్యైవ శిలోరస్కః సువ్యక్తో హిమవా నితి॥

విధిప్రయుక్తసత్కారైః స్వయం మార్గస్య దర్శకః
స తై రాక్రమయామాస శుద్ధాన్తం శుద్ధకర్మభిః॥

తత్ర వేత్రాసనాసీనాన్ కృతాసనపరిగ్రహః
ఇ త్యువా చేశ్వరాన్ వాచం ప్రాఞ్జలి ర్భూధరేశ్వరః॥

అపమేఘోదయం వర్ష మదృష్టకుసుమం ఫలమ్
అతర్కితోపపన్నం వో దర్శనం ప్రతిభాతి మే॥

మూఢం బుద్ధ మివాత్మానం, హైమీభూత మి వాయసం,
భూమే ర్దివ మి వారూఢం, మన్యే భవదనుగ్రహాత్॥

అద్యప్రభృతి భూతానా మధిగమ్యోఽస్మి శుద్ధయే,
య దధ్యాసిత మర్హద్భిస్తద్ధి తీర్థం ప్రచక్షతే॥

అవైమి పూత మాత్మానం ద్వయే నైవ ద్విజోత్తమాః
మూర్ధ్ని గఙ్గాప్రపాతేన ధౌతపాదామ్భసా చ వః॥

జఙ్గమం ప్రైష్యభావే వః స్థావరం చరణాఙ్కితం
విభక్తానుగ్రహం మన్యే ద్విరూప మపి మే వపుః॥

భవత్సంభావనోత్థాయ పరితోషాయ మూర్ఛతే
అపి వ్యాప్తదిగన్తాని నాఙ్గాని ప్రభవన్తి మే॥

న కేవలం దరీసంస్థం భాస్వతాం దర్శనేన వః
అన్తర్గత మపాస్తం మే రజసోఽపి పరం తమః॥

కర్తవ్యం వో న పశ్యామి, స్యా చ్చేత్ కిం నోపపద్యతే,
మన్యే మత్పావనా యైవ ప్రస్థానం భవతా మిహ॥

గగనమం దుండి వృద్ధాను ♦ గతిని దిగెడు, మునిపరంపర పావనాం ♦ బువులయందుఁ
బ్రతిఫలించెడురవిబింబ ♦ పఙ్క్తియట్లు, లెంతయుం బ్రాలుచుండెను ♦ వింతగదుర. 49

పూజ్యులైనట్టిఋషులను ♦ బూజసేయ, నర్ఘ్యసామగ్రి గైకొని ♦ యద్రిరాజు
దూరమున నుండి యెదురేగె ♦ భూరిబలము, వలన వసుమతి కుంగఁగాఁ ♦ బదములిడుచు.

ధాతుతామ్రాధరుండు సు ♦ స్నాతుఁడు నౌట, దేవదారుబృహద్భుజుం ♦ డై వెలయుటఁ
బ్రకృతిచేతనె తాశిలో ♦ రస్కుఁ డగుట, నతఁడు హిమవంతుఁడంచును ♦ వ్యక్తమయ్యె.

శాస్త్రవిహితంబుగా వారి ♦ సత్కరించి, తానె మార్గంబుఁ జూపుచుఁ ♦ దాపసులను
బావనచరిత్రపరులను ♦ బర్వతేంద్రు, డంతిపురమును జేర్చెను ♦ సాదరముగ. 25

హేమపీటలఁ గూర్చుండఁ ♦ బెట్టి మునులఁ, దాను గూర్చుండి ప్రభువులై ♦ తనరుచుండు
వారలకుఁ గేలుమోడిచి ♦ భక్తితోడ, నిట్లు పలుకంగఁదొడఁగె గి ♦ రీశ్వరుండు. 53

తలఁపకయె కల్గినట్టిమీ ♦ దర్శనంబు, వారిదములేకయే కల్గు ♦ వానగాను
నలరులేకయె కల్గిన ♦ ఫలముగాను, నామదికిఁ దోఁచె నోముని ♦ సాధులార. 54

మూఢుఁడగు నేనుజ్ఞాని నై ♦ పొదలినట్లు, లినుము బంగారముగ మాఱి ♦ యెసఁగినట్లు
వసుధనుండి దివం బెక్కి ♦ వఱలినట్లు, దలఁతు నను నేను మీదయ ♦ గలుగ నిట్లు. 55

నేఁడుమొదలుగ మునులార ♦ నేనుగూడఁ, బ్రాణులకుఁ దీర్థభూతుఁడై ♦ పరగువాఁడ
సాధువులు మెట్టునట్టియా ♦ స్థలము జగతిఁ, దీర్థ మగునని పెద్దలు ♦ దెలిపి యుంట.
రెంటిచేతఁ బవిత్రతఁ ♦ గంటి నంచు, నెంతు నామదిలోన ద్వి ♦ జేంద్రులార
గంగ నాశిరమునఁ బడఁ ♦ గాంచుకతనఁ, దలను మీపాదతీర్థముల్ ♦ దాల్చుకతన. 57

తలఁచుచున్నాఁడ నారెండు ♦ తనువులందు, వేఱు వేఱుగ మీదయఁ ♦ బెట్టినట్లు
జంగమంబున మీసేవ ♦ సల్పుపనులు, స్థావరంబున మీపాద ♦ సరసిజములు. 58

అవయవమ్ములు నావి ది ♦ గంతములను, నాక్రమించిన వైనమ ♦ హాత్ములార
భవదనుగ్రహమున నేను ♦ బడసినట్టి, హర్షము నిమిడ్చుకొనఁజాల ♦ నైతిఁజుండు. 59

ఎంతయును దయతోడ భా ♦ స్వంతులీరు, చూచుటంజేసి నాగుహల ♦ సొచ్చియున్న
తమమెకాదు రజస్సును ♦ దానిమీఁది, మన్మనస్తమమునుగూడ ♦ మాయ మయ్యె. 60

కలిగియున్నవె మీకుఁ గా ♦ వలయుపనులు, ఉండినను నవి నెఱవేఱ ♦ కుండఁ గలవె
నన్నుఁ గేవలముగఁ బావ ♦ నమ్ము సేయ, నిటకు దయచేసినారొ ♦ యెంచినాఁడ. 61

తథాపి తావత్ కస్మింశ్చి దాజ్ఞాం మే దాతు మర్హథ;
వినియోగప్రసాదా హి కింకరాః ప్రభవిష్ణుషు॥ 62

ఏతే వయ, మమీ దారాః, క న్యేయం కులజీవితమ్,
బ్రూత యే నాత్ర వః కార్య, మనాస్థా బాహ్యవస్తుషు॥ 63

ఇ త్యూచివాం స్త మేవార్థం గుహాముఖవిసర్పిణా
ద్వి రివ ప్రతిశబ్దేన వ్యాజహార హిమాలయః॥ 64

అ థాఙ్గిరస మగ్రిణ్య ముదాహరణవస్తుషు
ఋషయో నోదయామాసుః; ప్రత్యువాచ స భూధరమ్॥ 65

ఉపపన్న మిదం సర్వ, మతః పర మపి త్వయి,
మనసః శిఖరాణాం చ సదృశీ తే సమున్నతిః॥ 66

స్థానే త్వాం స్థావరాత్మానం విష్ణు మాహు; స్తథా హి తే
చరాచరాణాం భూతానాం కుక్షి రాధారతాం గతః॥ 67

గా మధాస్యత్ కథం నాగో మృణాలమృదుభిః ఫణైః,
ఆ రసాతలమూలాత్ త్వ మవాలమ్బిష్యథా న చేత్? 68

అచ్ఛిన్నామలసంతానాః సముద్రోర్మ్యనివారితాః
పునన్తి లోకాన్ పుణ్యత్వాత్ కీర్తయః సరితశ్చ తే॥ 69

య థైవ శ్లాఘ్యతే గఙ్గా పాదేన పరమేష్ఠినః
ప్రభవేణ ద్వితీయేన తథైవోచ్ఛిరసా త్వయా॥ 70

తిర్య గూర్ధ్వ మధస్తా చ్చ వ్యాపకో మహిమా హరేః
త్రివిక్రమోద్యత స్యాసీత్, సతు స్వాభావిక స్తవ॥ 71

యజ్ఞభాగభుజాం మధ్యే పద మాతస్థుషా త్వయా
ఉచ్చైర్హిరణ్మయం శృఙ్గం సుమేరోర్వితథీకృతమ్॥ 72

కాఠిన్యం స్థావరే కాయే భవతా సర్వ మర్పితం,
ఇదంతు తే భక్తినమ్రం సతా మారాధనం వపుః॥ 73

త దాగమనకార్యం నః శృణు కార్యం త వైవతత్
శ్రేయసా ముపదేశా త్తువయమ త్రాంశభాగినః॥ 74

అట్టు లుండినఁగూడ నో ◆ యార్యులార, యాజ్ఞ నేదైన నా కిడ ◆ నర్హు లీరు
ప్రభువులయనుగ్రహం బనఁ◆బనులయందు, భృత్యులనుగూర్చుటయెగాక ◆ వేఱెయున్నె

ఇదిగొ మీసేవకుఁడ; నిదె◆యీమెభార్య, కులమునకుఁ బ్రాణమైయున్న ◆ కూఁతురిదిగొ
యెవరితోఁ గార్యమున్నదో◆యెఱుఁగనిందు, లెక్కఁగొనబాహ్యవస్తువు◆ నొక్కఁటేని.

ఇట్లు పలుకంగ హిమవంతుఁ ◆ డిదియె మరల, నొత్తిచెప్పినవిధముగ ◆ నొప్పుపగిది
నమ్మహాగిరివరగహ్వ ◆ రాళి నుండి, వెడలెనపుడు ప్రతిధ్వనుల్ ◆ వేడ్కమీఱ. 64

అంతఁ జాతుర్యముగ మాట◆లాడువారి, యందు నగ్రేసరుం డగు ◆ నాంగిరసుని
ఋషులు పురిగొల్ప నతఁడు గి◆రీంద్రునకును, నెలమితో నుత్తరం బిచ్చె ◆ నివ్విధమున.

ఈవు చెప్పినదే గాక ◆ యింతకంటె, నధిక మయినదిగూడ నీ ◆ యందుఁ గలదు
నీదుశిఖరంబు లెట్టులో ◆ నీమనంబు, నొప్పుచున్నది యట్టులే ◆ యున్నతముగ. 66

జంగమస్థావరములకు ◆ శైలరాజ!, నీకడుపు తావలంబయి ◆ నెగడుకతన
స్థావరాత్మకుఁ డౌహరి ◆ వీ వటంచుఁ, బండితోత్తము లందఱుఁ ◆ బలుకుచుంద్రు. 67

ధరను బాతాళమూలమ్ము ◆ దాఁక నీవు, పాదములచేతఁ బైకెత్తి ◆ పట్టవేని
పాము తామరతూఁడుల ◆ వంటి వైన, తనదుపడగలమీఁదను ◆ దాల్పఁ గలదె. 68

నిత్యనిర్మలసంతాన ◆ నిచయ మంది, కడలితరగలయడ్డును ◆ గాంచకుండఁ
బొలుచునీకీర్తులును నదుల్ ◆ భువనములను, బావనముఁ జేయుఁదాముపా◆వనములౌట.

విష్ణుపాదంబునం బుట్టి ◆ వెలయుకతన, నెట్లు కొనియాడఁబడుచుండు ◆ నట్లె మరల
నున్నతశిరస్కుఁ డగునీకు ◆ నుద్భవించి, గంగ గొనియాడఁబడియె ను◆త్తుంగకీర్తి! 70

మూఁడుపాదమ్ములను బెట్టఁ ◆ బూనినప్పు, డడ్డముగఁ గ్రిందుమీఁదుగ ◆ నడరి పర్వు
నాత్రివిక్రమమహిమ యో ◆ యద్రిరాజ!, కలిగెఁబో నీకు స్వాభావి◆కమ్ము గాఁగ.

యజ్ఞభాగము భుజియించు ◆ నమరవరుల, నడుమ నెలకొనుభాగ్యంబుఁ ◆ బడసి తీవు
ఎంతయున్నతకాంచన ◆ శృంగ మున్న, స్వర్ణశైలంబు నీముందు ◆ వ్యర్థము గద. 72

కఠినభావంబు స్థావర ◆ కాయమందుఁ, బూర్ణముగఁ బెట్టి పూజ్యులఁ ◆ బూజసల్ప
భక్తి నిడితివి నమ్రభా ◆ వంబు నీదు, జంగమాత్మక మైనయీ ◆ యంగమందు. 73

ఇంక వచ్చినపని విను ◆ మెఱుకపఱతుఁ, గార్యమంతయు నీదయి ◆ కాలుచుండు
శ్రేయమును నీకుఁ దెలియంగఁ◆జేయునట్టి, వంతుమాత్రమె మాకుండుఁ◆బర్వతేంద్ర.

అణిమాదిగుణోపేత మస్పృష్టపురుషాన్తరం
శబ్ద మీశ్వర ఇత్యుచ్చైః సార్ధచన్ద్రం బిభర్తి యః॥ 75

కలితాన్యోన్యసామర్థ్యైః పృథివ్యాదిభి రాత్మభిః
యే నేదం ధ్రియతే విశ్వం ధుర్యై ర్యానమి వాధ్వని॥ 76

యోగినో యం విచిన్వన్తి క్షేత్రాభ్యన్తరవర్తినమ్
అనావృత్తిభయం యస్య పద మాహు ర్మనీషిణః॥ 77

సతే దుహితరం సాక్షాత్ సాక్షీ విశ్వస్య కర్మణాం
వృణుతే వరదః శమ్భు రస్మత్సంక్రామితైః పదైః॥ 78

త మర్థ మివ భారత్యా సుతయా యోక్తు మర్హసి
అశోచ్యా హి పితుః కన్యా సద్భర్త్రే ప్రతిపాదితా॥ 79

యావ న్త్యేతాని భూతాని స్థావరాణి చరాణిచ
మాతరం కల్పయ న్త్వేనా మీశో హి జగతః పితా॥ 80

ప్రణమ్య శితికణ్ఠాయ విబుధా స్తదనన్తరం
చరణౌ రఞ్జయన్త్వస్యా శ్చూడామణిమరీచిభిః॥ 81

ఉమా వధూ, ర్భవాన్ దాతా, యాచితార ఇమే వయమ్,
వర శ్శంభు; రలం హ్యేష త్వత్కులోద్భూతయే విధిః॥ 82

అస్తోతుః స్తూయమానస్య వన్ద్యస్యానన్యవన్దినః
సుతాసంబన్ధవిధినా భవ విశ్వగురో ర్గురుః॥ 83

ఏవంవాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ
లీలాకమలపత్త్రాణి గణయామాస పార్వతీ॥ 84

శైలః సంపూర్ణకామోఽపి మేనాముఖ ముదైక్షత ;
ప్రాయేణగృహిణీనేత్రాః కన్యార్థేషు కుటుమ్బినః॥ 85

మేనే మేనాపి తత్ సర్వం పత్యుః కార్య మభీప్సితమ్;
భవ న్త్యవ్యభిచారిణ్యో భర్తు రిష్టే పతివ్రతాః॥ 86

ఇద మత్రోత్తరం న్యాయ్య మితి బుద్ధ్యా విమృశ్య సః
ఆదదే వచసా మన్తే మఙ్గలాలంకృతాం సుతామ్॥ 87

అణిమ మొదలగుగుణగణ ♦ మమరువాఁడు, ఇతరులకు నెవ్వరికి ధరి ♦ యింపఁ గాని
గొప్పయీశ్వరపదముచే ♦ నొప్పువాఁడు, అర్ధచంద్రుని దాలిచి ♦ యలరువాఁడు. 75

దారి రథమును నశ్వముల్ ♦ దాల్చునట్లు, కలిసి మెలఁగెడుశక్తిచేఁ ♦ గ్రాలుచుండు
పృథివి మొదలగుతనమూర్తు ♦ లెనిమిదింట, విశ్వమంతయు వహియించి ♦ వెలుఁగువాఁడు.

సర్వభూతాంతరాత్ముఁ డై ♦ సర్వయోగి, వరులచేతను వెదుకంగఁ ♦ బడెడువాఁడు
అతనిపద మొంద మరలు భ ♦ యమ్ము లేదు, జనుల కంచని బాధు లనఁ ♦ దనరువాఁడు.

కేవలము లోకమందలి ♦ క్రియల కెల్ల, సాక్షి యై కోర్కె లొసఁగెడు ♦ శంకరుండు
కోరుచున్నాఁడు నీకూర్మి ♦ కూఁతు నొసఁగు, మంచు స్వయముగ మామాట ♦ లందుఁ జేరి.

మంచిభర్తకుఁ గన్య న ♦ ర్పించుతండ్రి, వగను బొందఁడు గావున ♦ నగకులేంద్ర !
వాక్కు నర్థంబుతోఁ గూర్చు ♦ పగిదిఁ దోఁప, నతనితోఁ గూర్పుమయ్యా నీ ♦ సుతను హితను.

హరుఁడు జగములతండ్రి యై ♦ యలరుకతన, స్థావరమ్మును మఱియును ♦ జంగమమ్ము
లనెడుభూతాళి కెల్ల నో ♦ యద్రిరాజ!, నీకుమారితె తల్లి యై ♦ నెగడుఁ గాత. 80

సురవరులు నీలకంఠుని ♦ చరణములకుఁ, బ్రణతు లొనరించి తదనంత ♦ రమ్ము నందుఁ
దమశిరోమణికిరణసం ♦ తతులచేత, నీమెచరణమ్ములను వెల ♦ యింత్రు గాత. 81

వధువు పార్వతి; యిచ్చెడు ♦ వాఁడ వీవు, అడుగుచుండెడువా రేము ♦ హరుఁడువరుఁడు
కొదువయుండునె యిట్టిని ♦ యొదవియుండఁ, జాలుఁగద యివి నీకులో ♦ చ్ఛ్రియమునకును.

పొగడఁబడుచుండి పరులను ♦ బొగడనట్టి, మ్రొక్కఁబడుచుండి పరులకు ♦ మ్రొక్కనట్టి
శంకరున కిచ్చి నీసుతఁ ♦ జారుచరిత, విశ్వగురునకు గురువయి ♦ వెలయు మయ్య. 83

ఇప్పగిది వేల్పుజడదారి ♦ జెప్పుచుండ, వదనమును వంచి తనతండ్రి ♦ ప్రక్కనుండి
యంద మైనట్టిలీలార ♦ విందమందు, నుండు రేకుల లెక్కించు ♦ చుండె గౌరి. 84

ఎంతయును బూర్ణ మైనట్టి ♦ యిచ్ఛయున్న, భూధరేంద్రుండు మేనక ♦ మొగముచూచెఁ
గన్యవిషయిక మైనట్టి ♦ కార్య మెఱుఁగ, గృహిణులేకద కన్నులు ♦ గేస్తులకును. 85

మేనకయు భర్త యిష్టంబు ♦ దా నెఱింగి, సర్వమునకును బూర్తిగ ♦ సమ్మతించెఁ
బతులు గోరెడుకోర్కెకి ♦ సతులు జగతి, నెన్నఁడును గాని మీఱంగ ♦ నెంచరు గద.

మునివరుం డాడుమాటలు ♦ ముగియఁ గానె, యిదియె తగునుత్తరం బని ♦ యెంచి మదిని
మిగుల శోభాకరంబుగ ♦ మెఱయునట్లు, కూఁతుఁ గైసేసి చేపట్టి ♦ కొనుచుఁ దెచ్చి.

ఏహి, విశ్వాత్మనే వత్సే, భిక్షాసి పరికల్పితా;
అర్థినో మునయః; ప్రాప్తం గృహమేధిఫలం మయా॥ 88

ఏతావ దుక్త్వా తనయా, మృషీ నాహ మహీధరః
'ఇయం నమతి వః సర్వాన్ త్రిలోచనవధూరి' తి॥ 89

ఈప్సితార్థక్రియోదారం తేభినన్ద్య గిరే ర్వచః,
ఆశీర్భి రేధయామాసుః పురఃపాకాభి రమ్బికామ్॥ 90

తాం ప్రణామాదరస్రస్తజామ్బూనదవతంసకాం
అఙ్కమారోపయామాస లజ్జమానా మరున్ధతీ॥ 91

తన్మాతరం చాశ్రుముఖీం దుహితృస్నేహవిక్లబాం
వర స్యానన్యపూర్వస్య విశోకా మకరో ద్గుణైః॥ 92

వైవాహికీం తిథిం పృష్టా స్తత్క్షణంహర బన్ధునా
తే త్ర్యహా దూర్ధ్వ మాఖ్యాయ చేరు శ్చీరపరిగ్రహాః 93

తే హిమాలయ మామన్త్ర్య, పునః ప్రాప్య చ శూలినం;
సిద్ధం చాస్మై నివే ద్యార్థం, తద్విసృష్టాః ఖ ముద్యయుః॥ 94

పశుపతి రపి తా న్యహాని కృచ్ఛ్రా
దగమయ దద్రిసుతాసమాగమోత్కః.
క మపర మవశం న విప్రకుర్యు ?
ర్విభు మపి తం య దమీ స్పృశన్తి భావాః॥ 95

ఇతి శ్రీకాళిదాసకృతౌ కుమారసంభవే మహాకావ్యే ఉమా
ప్రదానో నామ షష్ఠస్సర్గః.

అమ్మరో రమ్మ నిన్ను బి♦చ్చమ్మ గాఁగ, నప్పగింతు ధృవమ్ము వి♦శ్వాత్మునకును
వీరె యాచింపవచ్చిన ♦వారు మునులు, పడయఁగంటి గృహాశ్రమ♦ఫలము తనయ. 88

ఇట్లు తనపుత్రితోఁ బల్కి ♦ఋషులఁ జూచి, యీమె ముక్కంటిభార్య మీ♦కెల్లరకును
బ్రణతి సేసెడు నిదిగో దే♦వర్షులార!, యనుచుఁ బలికెను శైలరా ♦ జాధిరాజు. 89

ఈప్సితము దీర్చినయుదారు♦హిమగిరీంద్రు, పలుకు లెంతయుఁ గొనియాడి♦పార్వతికిని
వెంటనే ఫలియించుదీ ♦ వెనల నిచ్చి, హర్షమును బెంచె నపు డామ♦హర్షిగణము. 90

తనపదమ్ముల కెఱఁగెడు ♦ తమిని జెవిని, జాళువాపైఁడికమ్ములు ♦ జాఱిపోవ
సిగ్గుపడుచుండు గౌరిని ♦ జేరఁదీసి, యొడి నరుంధతి యిడుకొనెఁ♦గడుఁ బ్రియమున. 91

కూఁతునందలిప్రీతిచే ♦ భీతి గాంచి, కనులఁ దడిగొన్న మేనక ♦ ననునయించె
నన్య నెఱుఁగనిసర్వస♦మ్మాన్య వరుని, సుగుణములఁ దెల్పి యయ్యాఁ♦జోతి యపుడు.

పెండ్లిదినమును సెలవిండు ♦ ప్రీతి నంచు, భవునిబాంధవుఁ డౌహిమ♦వంతుఁ డడుగ
మూఁడుదినముల కావలి నాఁ డటంచుఁ, దెలిపి తరలిరి తమదారి ♦ దేవమునులు. 93

ఇట్లు హిమవంతు వీడ్కొని ♦ యెలమితోడ, శివుసమీపించి తమకార్య ♦ సిద్ధిఁ దెల్పి
యతనిసెలవును గైకొని ♦ యంతరిక్షు, మునకు నెగసిరి యమ్మహా♦మునులు ఘనులు. 94

ఉత్పలము. పట్టగరానియట్టితమిఁ ♦ బార్వతితోడిసమాగమంబుకై
యెట్టెటులో దినమ్ములు మ ♦ హేశుఁడు వుచ్చుచునుండె శూలి నే
యిట్టులు సేయ నిం కెవరి ♦ నెట్టులు సేయవు మానసంబులన్
బుట్టెడునీవికారములు ♦ పోలునె తెల్పఁగఁ దత్ప్రకారముల్. 95

గద్య.

ఇది శ్రీపరమేశ్వరకరుణాకలిత లలితకవితాకలిత శ్రీరామలక్ష్మాంబా
బుచ్చివేంకయామాత్యతనూజాత సకలసజ్జనవిధేయ ఆదిపూడి
సోమనాథనామధేయప్రణీతం బయినయాంధ్రకుమార
సంభవమునందుఁ నుమాపరిదానం
బనుషష్ఠాశ్వాసము.



శ్రీ

# కుమారసంభవమ్.



## సప్తమస్సర్గః.



అథౌషధీనా మధిపస్యవృద్ధౌ తిథౌచ జామిత్ర గుణాన్వితాయామ్
సమేతబంధు ర్హిమవాన్సుతాయా వివాహదీక్షా విధిమన్వతిష్ఠత్॥ 1

వైవాహికైః కౌతుక సంవిధానై ర్గృహేగృహే వ్యగ్రపురంధ్రివర్గమ్
ఆసీత్పురం సానుమతోనురాగా దంతఃపురం చైకకులోపమేయమ్॥ 2

సంతానకాకీర్ణ మహాపథంత చ్చీనాంశుకైః కల్పితకేతుమాలమ్
భాసోజ్జ్వలత్కాంచన తోరణానామ్ స్థానాంతరం స్వర్గ ఇవా బభాసే॥ 3

ఏకైవసత్యా మపి పుత్రపజ్క్తౌ చిరస్యదృష్టేవ మృతోత్థితేవ
ఆసన్న పాణిగ్రహణేతిపిత్రో రుమావిశేషో చ్ఛ్వసితం బభూవ॥ 4

అంకాద్యయా వంకముదీరితాశీః సామండ నాన్మండన మన్వభుంక్త
సంబంధిభిన్నోపి గిరేః కులస్య స్నేహ స్తదే కాయతనం జగామ॥ 5

మైత్రేముహూర్తే శశలాంఛనేన యోగంగతాసూత్తర ఫల్గునీషు
తస్యాః శరీరే ప్రతికర్మచక్రు ర్బంధుస్త్రియోయాః పతిపుత్రవత్యః॥ 6

సాగౌరసిద్ధార్థ నివేశవద్భి ర్దూర్వా ప్రవాళైః ప్రతిభిన్నశోభమ్
నిర్నాభికౌశేయ ముపాత్తబాణ మభ్యంగనే పథ్యమలం చకార॥ 7

బభౌచ సంపర్క ముపేత్యబాలా నవేనదీక్షా విధిసాయకేన
కరేణభానో ర్బహులావసానే సంధుక్ష్యమాణేవ శశాంకరేఖా॥ 8

తాంలోధ్రకల్కేన హృతాంగతైలా మాశ్యానకాలే యకృతాంగరాగామ్
స్నానా మభిషేక యోగ్యాం నార్యశ్చ తుష్కాభిముఖం వ్యనైషుః॥ 9



శ్రీ

# కుమారసంభవము.



## సప్తమాశ్వాసము.



### గీతములు.

బంధువులఁ గూడి యాహిమ♦వంతుఁ డంత, వృద్ధిచంద్రుండు సప్తమ♦శుద్ధి గల్గు
శుభదినంబున దీక్షతో ♦ సుతకుఁ బెండ్లి, సక్రమంబుగ జరప ను ♦ పక్రమించె. 1
ఎంతయును వేడ్కఁ గేస్తురాం♦డ్రింట నింటఁ, బెండ్లిపనులను సలుపుచు♦ వెలయుచుంట
నంతిపురమును నానాను ♦మంతుపురముఁ, గలసి యంతయు నొకయిల్లు♦కరణి మెఱసె.
సురకుసుమాళిఁ జల్లిన ♦ వరపథముల, ఖ్యాత-చీనాంబరోపేత ♦ కేతనములఁ
జాయశోభాకరస్వర్ణ ♦ తోరణముల, వఱలె నాపురి రెండవ ♦ స్వర్గ మనఁగ. 3
పిల్లలందును దానొకఁ ♦ పిల్ల యయ్యె, దగ్గఱిలఁ బెండ్లి, తనతల్లి ♦ దండ్రులకును
మడసి బ్రదికినయదివలెఁ ♦ దడవులకును, నగపడినదానివలెఁ బ్రియ♦మగుచుఁ దోఁచె. 4
ఒడి నొడిని నుండి దీవెనల్ ♦ పడసి పడసి, నగలపై నగ లంది యా ♦ నగతనూజ
బంధువులయందు భేదముల్ ♦ పరగియున్నఁ, గులమునకు నెల్లఁ బ్రేమైక♦ నిలయమయ్యె.
ఉత్తరను గూడి శశి యుండ♦నుదయమాది, మూడవముహూర్తమున శైల♦పుత్రిఁ జేరి
పెనిమిటియుఁ బుత్రులుం గల ♦ పేరటాండ్రు, పెండ్లికూఁతును జేసిరి ♦ ప్రీతితోడ. 6
శ్వేతమై యొప్పునావాలు ♦ లేఁతగఱిక, చేతఁ దనరార బాణముం ♦ జేతఁ దాల్చి
నాభిదిగఁ బట్టుపుట్టముఁ ♦ గట్టి గౌరి, తానమున కైనకై సేఁత ♦ దాల్చి మెఱసె. 7
విధివిహితమైనపరిణయ ♦ విధికిఁ గడఁగి, నూతనం బగుశరమును ♦ జేతఁ బూని
కృష్ణపక్షాంతమున సూర్య ♦ కిరణ మంది, పొలుచుశశిరేఖచాడ్పునఁ ♦ బొలిచెఁ గన్య. 8
వీడఁ దైలము లొద్దుగు ♦ పిండి నలిచి, తడిపొడిగ నుండుపరిమళ ♦ ద్రవ్య మలఁది
యర్హవస్త్రంబు గట్టించి ♦ యద్రిసుతను, గొనిచనిరి స్నానగృహమున ♦ కనుఁగుఁ జెలులు.

విన్యస్త వైదూర్య శిలాతలేస్మి న్నాబద్ధముక్తా ఫలభక్తిచిత్రే
ఆవర్జితాష్టా పదకుంభతోయైః సతూర్య మేనాం స్నపయాంబభూవుః॥ 10

సామంగళస్నాన విశుద్ధగాత్రీ గృహీతపత్యు ద్గమనీయవస్త్రా
నిర్వృత్తపర్జన్య జలాభిషేకా ప్రఫుల్లకాశా వసుధేవరేజే॥ 11

తస్మాత్ప్రదేశాచ్చ వితానవంతం యుక్తంమణిస్తంభ చతుష్టయేన
పతివ్రతాభిః పరిగృహ్యనిన్యే కౢప్తాసనం కౌతుకవేది మధ్యమ్॥ 12

తాం ప్రాఙ్ముఖీం తత్ర నివేశతన్వీం క్షణం వ్యలంబంత పురోనిషణ్ణాః
భూతార్థశోభాహ్రియమాణ నేత్రాః ప్రసాధనే సన్నిహితేపి నార్యః॥ 13

ధూపోష్మణాత్యాజితమార్ద్రభావమ్ కేశాంతమంతః కుసుమంతదీయమ్
పర్యాక్షిపత్కాచి దుదారబంధం దూర్వావతా పాండు మధూకదామ్నా॥ 14

విన్యస్తశుక్లా గురుచక్రురంగం గోరోచనాపత్రవిభక్తమస్యాః
సాచక్రవాకాంకితసైకతాయా స్త్రిస్రోతసః కాంతిమతీత్యతస్థౌ॥ 15

లగ్నద్విరేఫం పరిభూయపద్మం సమేఘలేఖం శశినశ్చబింబమ్
తదాననశ్రీ రలకైః ప్రసిద్ధై శ్చిచ్ఛేదసాదృశ్య కథాప్రసంగమ్॥ 16

కర్ణార్పితో లోధ్ర కషాయరూక్షే గోరోచనాక్షేప నితాంతగౌరే
తస్యాః కపోలే పరభాగలాభా ద్బబంధచక్షూంషి యవప్రరోహః॥ 17

రేఖావిభక్తః సువిభక్తగాత్ర్యాః కించిన్మధూచ్ఛిష్ట విమృష్టరాగః
కామప్యభిఖ్యాం స్ఫురితైరపుష్య దాసన్నలావణ్య ఫలోధరోష్ఠః॥ 18

పత్యుః శిరశ్చంద్రకలామనేన స్పృశేతిసఖ్యా పరిహాసపూర్వమ్
సారంజయిత్వా చరణౌకృతాశీ ర్మాల్యేనతాం నిర్వచనం జఘాన॥ 19

తస్యాః సుజాతోత్పలపత్రకాంతే ప్రసాధికాభిర్నయనే నిరీక్ష్య
నచక్షుషోః కాంతి విశేషబుద్ధ్యా కాలాంజనం మంగళ మిత్యుపాత్తమ్॥ 20

సాసంభవద్భిః కుసుమైర్లతేవ జ్యోతిర్భి రుద్యద్భి రివత్రియామా
సరిద్విహంగై రివలీయమానై రాముచ్యమానా భరణాచకాసే॥ 21

ఆత్మానమాలోక్య చ శోభమాన మాదర్శబింబే స్తిమితాయతాక్షీ
హరోపయానే త్వరితాబభూవ స్త్రీణాం ప్రియాలోక ఫలోహివేషః 22

మీఁద ముత్యాలచిత్రముల్ ♦ మెఱయఁ గ్రిందఁ, బచ్చపాలను బఱచిన ♦ భవనమందు
జలక మాడించి రామెను ♦ స్వర్ణకుంభ, తోయములవంచితూర్యముల్ ♦ మ్రోయుచుండ.
మంగళస్నానశుద్ధ యా ♦ మంగళాంగి, పరిణయోచిత మైనదు ♦ వ్వలువఁ దాల్చి
వృష్టి నభిషిక్త యై యొప్పి ♦ విరిసియున్న, తెల్లుపూఁ దాల్చువసుమతి ♦ రీతి మెఱసె.
మేలు మేల్కట్టుచేతను ♦ మెఱయునాల్గు, మణిమయ స్తంభముల నైన ♦ మండపమునఁ
బెండ్లియరుగునఁ గైసేసి ♦ పెట్టఁబడిన, పీటకడ కామెఁ దెచ్చిరి ♦ ప్రీతి సతులు. 12

దానిపైఁ దూర్పుమొగముగఁ ♦ దన్వినునిచి, యెదుటఁ గూర్చుండి, సాజమై ♦ యెసఁగునామె
చెలువుపైఁ గన్ను లరిగినఁ ♦ జెలులు గనుచు, తృణముగడపిరితొడవుల ♦ కడసెయున్న.

ధూప మిడి తడియార్చి ♦ తురిమి విరులు, వెండ్రుకల్ ముడివైచి యా ♦ వెలఁదిమిన్న
కెడ నెడను దూర్వ మొప్పెడు ♦ నిప్పపూల, దండఁ జక్కఁగఁ జుట్టెను ♦ దన్వియొకతె.

అగరుగందమ్ము తెల్లఁగా ♦ నలఁది మీఁద, నెఱ్ఱగోరోచనపుఁజిత్ర ♦ మెసఁగుచుండు
గౌరిమే న్మించెఁ జక్రవా ♦ కమ్ము లలరు, సైకతముతోడి గంగను ♦ సొరసందు. 15

ముంగురుల్ దిద్దియున్నట్టి ♦ పాలఁతిమోము, తుమ్మెదలఁ గూడియుండెడు ♦ తోయజమును
జలదరేఖాన్వితం బగు ♦ శశిని దెగడి, సామ్యవాదముఁ బూర్వప ♦ క్షమ్ము సేసె. 16

నలిచి లొద్దుగ గోరోచ ♦ నమ్ము రాయఁ, గెంపుమీఱినఁ దత్సతి ♦ చెంపచేత
నందముగఁ జెవి నిడ్డయ ♦ వాంకురంబు, వింతమెఱపొంది కనులకు ♦ విందుఁ గొలిపె.

మెఱుఁగు మైనంబుచేఁ గని ♦ మించుసొబగు, ఫలము గననుండి నడుమను ♦ లలితరేఖ
నలరువ్యక్తాంగిక్రీమోవి ♦ యదరు గాంచి, చెప్పఁగాఁ గాని కాంతిచే ♦ నొప్పమీఱె. 18

చరణమున లత్తుకను బూసి ♦ సకియ నగుచు, దీనిచే భర్త తలమీఁదఁ ♦ బూనియున్న
విధునికళఁ దాఁకు మంచు దీ ♦ వింప గౌరి, దడచే మోదె నోరెత్త ♦ కుండ దాని. 19

కలువరేకులకాంతిచేఁ ♦ గ్రాలుగిరిజ, కనుల నీక్షించి పరిచారి ♦ కాగణమ్ము
కాంతికరమని కాక మం ♦ గళకరమ్ము, గాఁగ మది నెంచి కాటుకఁ ♦ గనుల కిడిరి. 20

బాగుగాఁ బూచిపాల్చుపూఁ ♦ దీఁగె మాడ్కి, రమ్యముగఁ జుక్కలంగ్రాలు ♦ రాత్రిరీతి
నెంతయు విహంగముల నొప్పు ♦ నేఱుకరణి, మించునగలను దాలిచి ♦ మెఱసె గౌరి.

అవ్విశాలాక్షి స్తిమితమై ♦ యలరుదృష్టిఁ, దనసొబగునెల్ల నిలువుట ♦ ద్దమునఁ జూచి
హరునిదరిఁ జేరఁగాఁ గోరె ♦ నతివలకును, విభుఁడు గనిమెచ్చఁగాఁ గాదె ♦ వేషఫలము.

అథాంగులిభ్యాం హరితాలమార్ద్రం మాంగల్యమాదాయ మనఃశిలాంచ
కర్ణావసక్తామలదంతపత్రం మాతాతదీయం ముఖమున్నమయ్య॥ 23

ఉమాస్తనోద్భేద మనుప్రవృద్ధో మనోరథోయః ప్రథమంబభూవ
తమేవ మేనాదుహితుః కథంచి ద్వివాహదీక్షా తిలకంచకార॥ 24

బబంధచాస్రాకులదృష్టిరస్యాః స్థానాంతరే కల్పిత సన్నివేశమ్
ధాత్ర్యంగులీభిః ప్రతిసార్యమాణ మూర్ణామయం కౌతుకహస్తసూత్రమ్॥ 25

క్షీరోదవేలేవ సఫేనపుంజా పర్యాప్తచంద్రేవ శరత్త్రియామా
నవంనవక్షౌమ నివాసినీసా భూయో బభౌదర్పణ మాదధానా॥ 26

తామర్చితాభ్యః కులదేవతాభ్యః కులప్రతిష్ఠాం ప్రణమయ్యమాతా
అకారయత్కారయితవ్యదక్షా క్రమేణ పాదగ్రహణం సతీనామ్॥ 27

అఖండితం ప్రేమ లభస్వపత్యు రిత్యుచ్యతేతా భిరుమాస్మనమ్రా
తయాతుతస్యార్ధ శరీరభాజా పశ్చాత్కృతాః స్నిగ్ధజనాశిషోపి॥ 28

ఇచ్ఛావిభూత్యోరనురూపమద్రి స్తస్యాః కృతీకృత్య మశేషయిత్వా
సభ్యః సభాయాం సుహృదాస్థితాయాం తస్థౌవృషాంకా గమనప్రతీక్షః॥ 29

తావద్భవస్యాపి కుబేరశైలే తత్పూర్వపాణిగ్రహణానురూపమ్
ప్రసాధనం మాతృభి రాదృతాభి ర్న్యస్తం పురస్తా త్పురశాసనస్య॥ 30

తద్గౌరవాన్మంగళమండనశ్రీః సాపస్పృశే కేవలమీశ్వరేణ
స ఏవవేషః పరిణేతురిష్టం భావాంతరం తస్య విభోః ప్రపేదే॥ 31

బభూవభస్మైవ సితాంగరాగః కపాలమేవామల శేఖరశ్రీః
ఉపాంతభాగేషు చరోచనాంకో గజాజినస్యైవ దుకూలభావః॥ 32

శంఖాంతరద్యోతి విలోచనంయ దంతర్నివిష్టామలపింగతారమ్
సాన్నిధ్యపక్షే హరితాలమయ్యా స్తదేవజాతం తిలకక్రియాయాః॥ 33

యథాప్రదేశం భుజగేశ్వరాణాం కరిష్యతామా భరణాంతరత్వమ్
శరీరమాత్రం వికృతిం ప్రపేదే తథైవతస్థుః ఫణరత్న శోభాః॥ 34

దివాపినిష్ఠ్యూత మరీచిభాసా బాల్యాదనావిష్కృతలాంఛనేన
చంద్రేణనిత్యం ప్రతిభిన్నమౌలే శ్చూడామణేః కిం గ్రహణం హరస్య॥ 35

హారిదళమ్మున మణిశిల ♦ నైనగంద, మంగుళీద్వయమునఁ దాల్చి ♦ యగజమాత
వీనులను దంతపత్త్రిముల ♦ వెలయు గౌరి, మోము పైకెత్తి మంగళ ♦ ముగఁ దలంచి. 23

తనయ చనుదోయితోఁ బుట్టి ♦ దానితోడ, వృద్ధిపొందినకోర్కె యై ♦ వెలయుచుండు
తిలకమును దల్లి పుత్త్రికా ♦ తిలకమునకుఁ, బెట్టె హర్షభరమ్మును ♦ బట్టలేక. 24

కనులు హర్షాశ్రుజలములఁ ♦ గలఁగియుండఁ, దావు దప్పించి కట్టఁబో ♦ దాది చూచి
ప్రేల్లచేతను సవరింపఁ ♦ బెండ్లికైన, యూర్ణకంకణమును గట్టె ♦ నుమకు మాత. 25

తెల్లనురుఁ గొప్పక్షీరాబ్ధి ♦ తీరమట్లు, నిండుచందురుఁ గలశర ♦ న్నిశివిధమునఁ
దద్దయును జొల్చెఁ గొత్త్రియ ♦ ద్దమును దాల్చి, క్రాలువెలిపట్టుపుట్టంబుఁ ♦ గట్టె గౌరి.

అంత నర్చితకులదేవ ♦ తాళికెల్ల, మాత కర్ణోపదేశస ♦ మర్థసుతను
గులమణిని ముక్కఁగాఁ గొల్చి ♦ కూర్మితోడ, సతులయడుగులకెఱఁగించె ♦ సక్రమముగ.

పతియఖండానురాగమ్ము ♦ పడయవమ్మ, యంచు వారలు దీవింప ♦ వంచెఁ దలను
గాని యీశ్వరునర్ధాంగిగాఁ ♦ జెలంగి, యెల్లదీవెనలను మించి ♦ యొసఁగె గౌరి. 28

సభ్యుఁడును దక్షుఁ డైనట్టి ♦ శైలరాజు, తనవిభూతికి నిచ్చకుఁ ♦ దగినయట్లు
దీర్చి పనులెల్ల మిత్త్రిలఁ ♦ గూర్చి సభను, వృషభకేతనురాకకై ♦ వేచియుండె. 29

అంతలోపల నట రజ ♦ తాద్రియందుఁ, బురహరుం డైనయట్టియీ ♦ శ్వరునిముందుఁ
బరిణయంబున కైనయా ♦ భరణములను, దెచ్చిపెట్టిరి మాతృక ♦ లిచ్చతోడ॥ 30

వారియందలి తన కుంకు ♦ గౌరవమున, నమ్మహామండనమ్ముల ♦ నంటఁ గానె
విభునియెప్పటివేషమే ♦ పెండ్లికైన, వేషముగ మాఱిపోయెను ♦ వింతగాను. 31

చారుచందనముగను భ ♦ స్మమ్ము మాఱెఁ, గనకమయమకుటంబుగాఁ ♦ బునుక మాఱె
నంచగురుతులయంచుల ♦ నలరుచుండు, ఘనదుకూలంబుగా గజా ♦ జినము మాఱె. 82

లోనఁ బచ్చనిగుత్రిడును ♦ బూనియుండి, ఫాలమందలియెముకలోఁ ♦ బరగుకన్ను
తిలకమిడుచోట నెంతయుఁ ♦ జెలఁగుచుంట, నదియె హరితాళతిలకమై ♦ యలరఁ జొచ్చె

ఎచటిపన్నగరాజంబు ♦ లచట నుండి, భూరిమణిమండనములుగా ♦ మాఱిపోయె
నంగములుమాత్రమే మార్పు ♦ నందె కాని, పడగరతనంబు లెప్పటి ♦ పగిదినుండె. 34

క్రాలువెన్నెలఁ బగటను ♦ గాయునట్టి, బాల్యమం దుంటఁ గందను ♦ బడయనట్టి
చందురుండె కిరీటమై ♦ సతముఁ జెలఁగె, నింకఁ దలమానికం బేల ♦ శంకరునకు. 35

ఇత్యద్భుతైక ప్రభవః ప్రభావా త్ప్రసిద్ధనేపథ్య విధేర్విధాతా
ఆత్మానమాసన్న గణోపనీతే ఖడ్గే నిషక్త ప్రతిమం దదర్శ॥ 36

సగోపతిం నంది భుజావలంబీ శార్దూలచర్మాంతరితోరుపృష్ఠమ్
తద్భక్తిసంక్షిప్త బృహత్ప్రమాణ మారుహ్య కైలాస మివప్రతస్థే॥ 37

తం మాతరోదేవ మనువ్రజంత్యః స్వవాహనక్షోభ చలావతంసాః
ముఖైః ప్రభామండల రేణుగౌరైః పద్మాకరం చక్రురివాంతరిక్షమ్॥ 38

తాసాంచ పశ్చాత్కనక ప్రభాణాం కాలీకపాలా భరణాచకాసే
బలాకినీ నీలపయోదరాజీ దూరంపురః క్షిప్త శతహ్రదేవ॥ 39

తతోగణైః శూలభృతః పురోగై రుదీరితో మంగళతూర్య ఘోషః
విమానశృంగా ణ్యవగాహమానః శశంససేవావసరం సురేభ్యః॥ 40

ఉపాదదేతస్య సహస్రరశ్మి స్త్వష్ట్రానవం నిర్మితమాత పత్రమ్
సతద్దుకూలా దవిదూరమౌళి ర్బభౌపతద్గంగ ఇవోత్తమాంగే॥ 41

మూర్తేచగంగా యమునే తదానీం సచామరే దేవమసే విషాతామ్
సముద్రగా రూపవిపర్యయేపి సహంసపాతే ఇవలక్ష్యమాణే॥ 42

సమభ్యగచ్ఛ త్ప్రథమోవిధాతా శ్రీవత్సలక్ష్మా పురుషశ్చసాక్షాత్
జయేతివాచా మహిమానమస్య సంవర్ధయంతౌ హవిషేవవహ్నిమ్॥ 43

ఏకైవమూర్తి ర్బిభిదేత్రిధాసా సామాన్య మేషాం ప్రథమావరత్వమ్
విష్ణోర్హరస్తస్య హరిః కదాచి ద్వేధాస్తయోస్తా వపిధాతురాద్యౌ॥ 44

తం లోకపాలాః పురుహూతముఖ్యాః శ్రీలక్షణోత్సర్గ వినీతవేషాః
దృష్టిప్రదానే కృతనందిసంజ్ఞా స్తద్దర్శితాః ప్రాంజలయః ప్రణేముః॥ 45

కంపేనమూర్ధ్నః శతపత్రయోనిం వాచాహరిం వృత్రహణం స్మితేన
ఆలోకమాత్రేణ సురానశేషాన్ సంభావయామాస యథాప్రధానమ్॥ 46

తస్మైజయాశీః ససృజే పురస్తాత్ సప్తర్షిభిస్తాన్స్మిత పూర్వమాహ
వివాహయజ్ఞే వితతేత్రయూయ మధ్వర్యవః పూర్వవృతామయేతి॥ 47

విశ్వావసు ప్రాగ్రహరైః ప్రవీణైః సంగీయమాన త్రిపురావదానః
అధ్వానమధ్వాంత వికారలంఘ్య స్తతారతారాధిప ఖండధారీ॥ 48

మించుమహిమను నిట్లు ని♦ర్మించుకొనిన, వేషము వహించి వింతల ♦ వీడు హరుఁడు
గణము తెలిమిని దెచ్చిన ♦ ఖడ్గమందుఁ, బ్రతిఫలించెడునాత్మబిం ♦ బమును గాంచె.

భక్తిచేతను సంకోచ ♦ పఱచి మేను, మించువ్యాఘ్రాజినము వీఁపు ♦ మీఁదఁ దాల్చి
యొప్పువృషమును నందికే♦లూఁతఁ బూని, రజతగిరి నెక్కిన ట్లెక్కి ♦ ప్రభువువెడలె.

భవునివెనువెంటఁ జనుతమ♦వాహనముల, కంపమునఁ గుండలమ్ములు ♦ గదలవదన
మండలారుణకాంతుల ♦ మాతృకాళి, యాకసమ్మును జేసెఁ బ ♦ ద్మాకరముగ. 38

స్వర్ణకాంతులఁ జిమ్మెడు♦వారివెనుక, దూరముగ ముందు మెఱుపుల ♦ బారుఁబఱపి
కొక్కెరలఁగూడియుండుక్రొ♦క్కారుమొగిలు, గాలివలెఁబున్కినగలతోఁ♦గ్రాలెఁగాళి

అంత శివుముందు నెలమితో ♦ ననుగుగణము, సలుపుమంగళతూర్యఘో ♦ షమ్ము లేగి
యంబరస్థవిమానశ్రేం♦గాళిఁ జేరి, యమరులకుఁ దెల్పె సేవకు♦సమయమంచు. 40

త్వష్ట క్రొత్తగ నిర్మింపఁ ♦ దనరుచుండు, గొడుగు వెట్టెను వేవెల్గు ♦ మృదున కపుడు
తద్దుకూలము దాపునఁ ♦ దల వెలుంగ, నౌదలను గంగ పడునట్టు ♦ లభవుఁ డొప్పె. 41

యమునయును గంగ రూపమ్ము ♦ లంది శివుని, జామరంబులతో సేవ ♦ సలుపుచుండ
నదులరూపంబు వీడినన్ ♦ గదలుచుండు, నంచలను వీడనట్లు గా ♦ న్పించుచుండె. 42

హవ్యముల నగ్నిఁ బెంచెడు ♦ నట్టులతని, భవ్యమహిమను జయజయ ♦ వాక్యములను
బెంచు చాపరమేశ్వరు ♦ వెంటఁ జనిరి, యపుడు శ్రీవత్సలాంఛిత ♦ హరియు నలువ.

మూర్తి యొకఁడయ్యు భేదిల్లె ♦ మువ్వురగను, జెల్లుఁ బినపెద్దతనము వీ ♦ రెల్లరకును
హరుఁడు హరికాది హరియుఁ దా♦హరున కాది, బ్రహ్మ వీరికి వీరలు ♦ బ్రహ్మ కాది.

వీడి రాచిన్నెలనుగడు ♦ వినయమునను, నింద్రముఖలోకపాలకు ♦ లేగుదెంచి
సన్నిధికిఁగాను నందికి ♦ సన్న సేసి, యతఁడు సూపింపఁ గేల్మోడ్చి♦ రభవునకును. 45

భవుఁడు తలయూఁపి బ్రహ్మను,♦బలికి హరిని, నవ్వుచూపుటచేతను ♦ నాకవిభుని,
గేవలము వీక్షణమ్ముల ♦ దేవతలను, సర్వరీతిని నందఱ ♦ నాదరించె. 46

బ్రోల సప్తర్షులును జయ ♦ శ్రీలఁ బలుక, నివ్వివాహాఖ్యయజ్ఞార్థ ♦ మేను మిమ్ము
బుత్విజులు గాఁగ ముందెకో♦రితినిగాదె, యంచుఁజిఱునవ్వుతో నాద♦రించె శివుఁడు.

గాణ విశ్వావసువె యాది ♦ జాణలెల్లఁ, ద్రిపురజయమును వీణెపైఁ ♦ బ్రీతిఁ బాడ
వీతరాగుల బుద్ధిలో ♦ వెలయువాఁడు, బాలశశిశేఖరుఁడు వించుఁ♦ బ్రథముఁ గడపె.

ఖేఖేలగామీ తము వాహ వాహః సశబ్దచామీ కరకింకిణీకః
తటాభిఘాతా దివలగ్నపంకే ధున్వన్ముహుః ప్రోతఘనే విషాణే॥ 49

సప్రాప దప్రాప్త పరాభియోగం నగేంద్రగుప్తం నగరం ముహూర్తాత్
పురో విలగ్నైర్హరదృష్టిపాతైః సువర్ణసూత్రైరివ కృష్యమాణః॥ 50

తస్యోపకంఠే ఘననీలకంఠః కుతూహలాదున్ముఖపౌరదృష్టః
స్వబాణచిహ్నాదవతీర్య మార్గా దాసన్నభూపృష్ఠ మియాయ దేవః॥ 51

తమృద్ధిమద్బంధుజనాధిరూఢై ర్బృందైర్గజానాం గిరిచక్రవర్తీ
ప్రత్యుజ్జగామాగమన ప్రతీతః ప్రఫుల్లవృక్షైః కటకైరివ స్వైః॥ 52

వర్గావుభౌ దేవమహీధరాణాం ద్వారే పురస్యోద్ఘటితాపిధానే
సమీయతుర్దూరవిసర్పిఘోషౌ భిన్నైకసేతూ పయసామివౌఘౌ॥ 53

హ్రీమానభూద్భూమిధరో హరేణ త్రైలోక్యవంద్యేన కృతప్రణామః
పూర్వం మహిమ్నా సహితస్య దూర మావర్జితం నాత్మశిరో వివేద॥ 54

సప్రీతియోగా ద్వికసన్ముఖశ్రీ ర్జామాతురగ్రే సరతాముపేత్య
ప్రావేశయన్మందిర మృద్ధమేన మాగుల్ఫకీర్ణాపణమార్గపుష్పమ్॥ 55

తస్మిన్ ముహూర్తే పురసుందరీణా మీశాన సందర్శనలాలసానామ్
ప్రాసాదమాలాసు బభూవురిత్థం త్యక్తాన్యకార్యాణి విచేష్టితాని॥ 56

ఆలోకమార్గం సహసా వ్రజంత్యా కయాచి దుద్వేష్టనవాంతమాల్యః
బద్ధుం న సంభావిత ఏవ తావత్ కరేణ రుద్ధోఽపి చ కేశపాశః॥ 57

ప్రసాధికాలంబిత మగ్రపాద మాక్షిప్య కాచి ద్ద్రవరాగమేవ
ఉత్సృష్టలీలాగతిరాగవాక్షా దలక్తకాంకాం పదవీం తతాన॥ 58

విలోచనం దక్షిణమంజనేన సంభావ్య తద్వంచిత వామనేత్రా
తథైవ వాతాయన సన్నికర్షం యయౌ శలాకా మపరా వహంతీ॥ 59

జాలాంతరప్రేషిత దృష్టిరన్యా ప్రస్థానభిన్నాం న బబంధ నీవీమ్
నాభిప్రవిష్టాభరణప్రభేణ హస్తేన తస్థా వవలంబ్య వాసః॥ 60

అర్ధాచితా సత్వరముత్థితాయాః పదేపదే దుర్నిమితే గలంతీ
కస్యాశ్చిదాసీ ద్రశనా తదానీ మంగుష్ఠమూలార్పిత సూత్రశేషా॥ 61

క్రుమ్మి తతిరొంపి విదలించు♦కొనెడునట్లు, క్రుమ్మి మేఘమ్ము విదలించు♦కొనుచుఁ గొమ్ము
లీలఁ గొనిపోయె లీలతో♦వృషము దివిని, బైఁడిమువ్వలు కిణికిణి♦స్వనము లీన. 49

సొగసుగా ముందుఁ జనుశివు♦చూపు లనెడు, పైఁడిత్రాళ్లచే లాగఁ♦బడినయట్లు
నిముసమునఁ జేర్చె భవు నది ♦ హిమగిరీంద్ర, రక్షితపురంబు విగతప ♦ రాభవంబు. 50

ఎంతయును దమి మోముల♦నెత్తి ప్రజలు, గాంచఁ బురిదరిఘననీల♦గళుఁడు హరుఁడు
శాణరాజము తొలిఁ దాను♦ బఱపినట్టి, పథమునందుండి ధారణి ♦ పైకి దిగియె. 51

ఈశ్వరునిరాక కలరి న ♦ గేంద్రమౌళి, విదితరులఁ గ్రాలుచుండెడు ♦ చఱులతోడ
నెదురు జనినట్లు నగలచేఁ ♦ బొదలుబంధు, జనము లెక్కొనకరులతోఁ ♦ జనియెనెదుట.

కట్టతెగి రెండువరదలు ♦ గలిసినట్లు, తలుపు దెఱవఁ బురద్వార ♦ తలమునందుఁ
గలిసికొనె దేవనగవర్గ ♦ ములు చెలంగి, పాదముఘోషంబు కడుదూర♦మునకుఁ బర్వ.

త్రిభువనములకు వంద్యుఁడై ♦ తేజరిల్లు, శివుఁడు ప్రణమిల్ల నగపతి ♦ సిగ్గుఁ గొనియె
నభవుమహిమను దనశిర♦మంతవఱకె, యెంతయునువంచియుంటఁదా♦నెఱుఁగఁడయ్యె.

సంతసంబున ముఖవికా ♦ సంబు గన్న, గిరివరుండల్లు ముందుగా ♦ సరుగనిచ్చి
చీలమండలయెత్తునఁ ♦ బూలుగలిగి, వెలయుదారిని నింటఁ బ్ర ♦ వేశపెట్టె. 55

భవ్యతర మైనప్రాసాద ♦ పాళియందు, హరుని జూచుటయందలి ♦ యాసచేత
నిట్లు తమతమపనిపాటు ♦ లెల్ల వీడి, పౌరనారీగణమ్ములు ♦ చేరి రపుడు. 56

వీడి ముడి దారిపొడుగున ♦ విరులు రాల, వడిగ నొక్కతె జాలమ్ము♦వంకఁ బాఱెఁ
జేతఁ గురు లున్నచొప్పుటఁ ♦ జేరుదాఁక, వేయఁ దలపదు ముడిని న♦వ్వేలఁదిమిన్న.

ఓర్తు లత్తుకకై చాఁచి ♦ యున్నకాలు, దీసి వడిగను జాలమ్ము ♦ కేసి పఱచె
లలితగతిమాని యారని ♦ లక్కరసపు, టడుగుజాడల నించుచు ♦ నంతవఱకు. 58

కాటుకను బెట్టి తనకుడి ♦ కంటి, కపుడు, నెడమకంటికి నిడకయే ♦ యింతి యొక్కతె
పుడకచేతను బట్టి తాఁ ♦ బోయి చేరెఁ, దద్దయును వేడ్కతోడ వా ♦ తాయనమ్ము.

జాలమున దృష్టిపఱచుచుఁ ♦ జానయొర్తు, పోవుచుండఁగ వీడిన ♦ పోకముడిని
గట్టకయె జాఱుచీరెను ♦ బట్టి చేత, భూషణప్రభ నాభిపైఁ ♦ బొదల నిలిచె. 60

సతి యొకర్తుక మొలనూలు ♦ సగము గ్రుచ్చి, సత్వరమ్ముగ లేచి స ♦ సంభ్రమముగఁ
బోవ నడుగడ్డునకు జాఱి ♦ పోయి మణులు, కాలిబొటవ్రేలిదారంబె ♦ కడకు మిగిలె.

తాసాంముఖైరాసవగంధగర్భై ర్వ్యాప్తాంతరాః సాంద్రకుతూహలానామ్
విలోలనేత్రభ్రమరైర్గవాక్షాః సహస్రపత్రాభరణా ఇవాసన్॥ 62

తావత్పతాకాకులమిందుమౌళి రుత్తోరణం రాజపథం ప్రపేదే
ప్రాసాద శృంగాణి దివాపికుర్వన్ జ్యోత్స్నాభిషేక ద్విగుణద్యుతీని॥ 63

తమేకదృశ్యం నయనైః పిబంత్యో నార్యోనజగ్ము ర్విషయాంతరాణి
తథాహి శేషేంద్రియ వృత్తిరాసాం సర్వాత్మనాచక్షు రివప్రవిష్టా॥ 64

స్థానేతపో దుశ్చరమేతదర్థ మపర్ణయా పేలవయాపితప్తమ్
యాదాస్య మప్యస్య లభేతనారీ సాస్యాత్కృతార్థా కిము తాంకశయ్యామ్॥ 65

పరస్పరేణ స్పృహణీయశోభం నచేదిదం ద్వంద్వమయోజయిష్యత్
అస్మిన్ ద్వయేరూప విధానయత్నః పత్యుః ప్రజానాం విఫలోభవిష్యత్॥ 66

ననూనమారూఢ రుషాశరీర మనేనదగ్ధం కుసుమాయుధస్య
వ్రీడాదముం దేవము దీక్ష్యమన్యే సన్న్యస్తదేహః స్వయమేవకామః॥ 67

అనేనసంబంధ ముపేత్యదిష్ట్యా మనోరథ ప్రార్థిత మీశ్వరేణ
మూర్ధానమాలి క్షితిధారణోచ్చ ముచ్చైస్తరం వక్ష్యతి శైలరాజః॥ 68

ఇత్యోషధిప్రస్థ విలాసినీనాం శృణ్వన్కథాః శ్రోత్రసుఖాస్త్రినేత్రః
కేయూరచూర్ణీ కృతలాజముష్టిం హిమాలయస్యా లయమాససాద॥ 69

తత్రావతీర్యా చ్యుతదత్తహస్తః శరద్ఘనాద్దీధితిమానివోక్ష్ణః
క్రాంతానిపూర్వం కమలాసనేన కక్ష్యాంతరాణ్యా ద్రిపతేర్వివేశ॥ 70

తమన్వగిందప్రముఖాశ్చదేవాః సప్తర్షిపూర్వాః పరమర్షయశ్చ
గణాశ్చ గిర్యాల యమభ్యగచ్ఛన్ ప్రశస్త మారంభ మివోత్తమార్థాః॥ 71

తత్రేశ్వరోవిష్టర భాగ్యథావత్ సరత్నమర్ఘ్యం మధుమచ్చగవ్యమ్
నవేదుకూలే చనగోపనీతం ప్రత్యగ్రహీత్సర్వ మమంత్రవర్జమ్॥ 72

దుకూలవాసాః సవధూసమీపం నిన్యేవినీతై రవరోధదక్షైః
వేలాసమీపం స్ఫుటఫేనరాజి ర్నవైరుదన్వా నివచంద్రపాదైః॥ 73

తయాప్రవృద్ధాననచంద్రకాంత్యా ప్రఫుల్లచక్షుః కుముదః కుమార్యా
ప్రసన్నచేత స్సలిలః శివోభూత్ సంసృజ్యమానః శరదేవలోకః॥ 74

మధుసుగంధముచే నొప్పి ♦ మంజుగతిని, దమిని జలియించుకన్నులన్ ♦ భ్రమరతతుల
నలరుచుండెడుసుదతుల ♦ యాననములు, పద్మభూషలై తోఁచె గ ♦ వాక్షములకు. 62

చంద్రశేఖరుఁ డంతఁ బ్రా ♦ సాదపాళి, శిఖరములకాంతివెన్నెల ♦ చేతఁ బగలె
యినుమడింపుచుఁ దోరణా ♦ లెత్తియుండు, ధ్వజము లెగసెడుతద్రాజ ♦ పథముఁ జేరె.

అమ్మనోజ్ఞనిజాపుల ♦ నానుసతుల, కన్యవిషయంబులకు మనం ♦ బరుగదయ్యెఁ
దకుఁటింద్రియవృత్తులు ♦ దనరుచుండెఁ, గంటిలోపలనే స్థితిఁ ♦ గాంచినట్లు. 64

గౌరి సుకుమారి యితనికై ♦ ఘోరమైన, తప మొనర్చుట యెంతయుఁ ♦ దగును దగును
దాస్యము లభించునారియే ♦ ధన్య యనఁగ, నితని యొడిఁబండుసతి నింక ♦ నెన్నఁదరమె.

ఇట్లు లన్యోన్యమును మించు ♦ నట్టిశోభఁ, గాంచు నీమిథునంబును ♦ గలుపకున్న
వీరిలో నిట్టిరూపంబు ♦ వెట్టుటకును, విధి యొనర్చినయత్నంబు ♦ వృథయె కాదె. 66

కుసుమశరునిశరీరంబు ♦ కుపితుఁడైన, హరుఁడు గాల్చినమాట స ♦ త్యంబు కాదు
శంకరునికాయమునుజూచి ♦ స్వయముగానె, మరుఁడు దేహంబులజ్జచేఁ ♦ దొరఁగెనిజము.

తాను గోరినకోరిక ♦ దైవకృపను, శంభుసంబంధమునఁ జేసి ♦ సఫల మగుట
ధర ధరించుట నుచ్చనూ ♦ గిరివరేణ్యు, శీర్ష ముచ్చైస్తరం బయి ♦ చెలఁగుఁ జెలియ..

పౌరసతు లిట్టు లింపుగాఁ ♦ బలుక వినుచుఁ, గ్రాలుహిమవంతునిల్లు ము ♦ క్కంటి చేరె
దండకడియాలరాపిడిఁ ♦ దలిరుబోండ్ల, పిడికిళులలోనిపేలాలు ♦ పిండిగాఁగ. 69

శారదాభ్రము డిగుసూర్యు ♦ సరణి నచట, శివుఁడు వృషభంబు డిగె హరి ♦ చేయివట్టి
యజుఁడు ముందఱ నడువఁగా ♦ నద్రివరుని, వివిధకక్ష్యాంతరమ్ములు ♦ వేడ్కఁ జొచ్చె.

అతనివెంబడి నింద్రుఁడే ♦ యాదిసురలు, సప్తఋషు లాదిపరమర్షి ♦ సముదయములు
గణములును జొచ్చె శైలేంద్రు ♦ ఘనగృహమ్ము, వరప్రయత్నంబుఁ జొచ్చు స ♦ త్ఫలములట్లు

అచటఁ బొలిచెడుపీటపై ♦ నధివసించి, మణియు శార్ఘ్యంబు దధితోడి ♦ మధువుమఱియు
నవదుకూలంబు హిమగిరి ♦ నాథుఁ డిడఁగ, స్మరహరుఁడు స్వీకరించె స ♦ మంత్రకముగ.

శ్వేతవస్త్రి నిశంభుని ♦ జేర్చి రపుడు, పడఁతు లంతఃపురమువారు ♦ వధువుకడకు
నూత్నచంద్రునికిరణాళి ♦ నురుఁగుతోడి, సింధువును దీరమునకును ♦ జేర్చునట్లు. 73

గౌరి వర్థిల్లువదనేందు ♦ కాంతిచేత, వరశరద్రమఁ బోలఁ ద ♦ త్తరుణిఁ గూడి
జగముఁ బొలెను శివుఁడు ప్ర ♦ సన్నచిత్త, సలిలమును బూని విచ్చుక ♦ న్గలువ లూని.

తయోః సమాపత్తిషు కాతరాణి కించిద్వ్యవస్థాపితసంహృతాని
హ్రీయంత్రణాం తత్క్షణమన్వభూవ న్నన్యోన్యలోలాని విలోచనాని॥ 75

తస్యాః కరం శైలగురూపనీతం జగ్రాహ తామ్రాంగులిమష్టమూర్తిః
ఉమాతనౌ గూఢతనోః స్మరస్య తచ్ఛంకినః పూర్వ మివప్రరోహమ్॥ 76

రోమోద్గమః ప్రాదురభూ దుమాయాః స్విన్నాంగుళిః పుంగవకేతురాసీత్
వృత్తిస్తయోః పాణిసమాగమేన సమం విభక్తేవ మనోభవస్య॥ 77

ప్రయుక్త పాణిగ్రహణం యదన్య ద్వధూవరం పుష్యతికాంతి మగ్ర్యామ్
సాన్నిధ్యయోగా దనయోస్తదానీం కింకథ్యతే శ్రీరుభయస్యతస్య॥ 78

ప్రదక్షిణప్రక్రమణాత్కృశానో రుదర్చిషస్తన్మిథునంచకాసే
మేరోరుపాంతేష్వివ వర్తమాన మన్యోన్యసంసక్త మహస్త్రియామమ్॥ 79

తౌ దంపతీత్రిః పరిణీయవహ్ని మన్యోన్య సంస్పర్శ నిమీలితాక్షౌ
సకారయామాస వధూంపురోధా స్తస్మి న్సమిద్ధార్చిషిలాజమోక్షమ్॥ 80

సాలాజధూమాంజలిమిష్టగంధం గురూపదేశా ద్వదనంనినాయ
కపోలసంసర్పి శిఖః సతస్యా ముహూర్తకర్ణోత్పలతాంప్రపేదే॥ 81

తదీషదార్ద్రారుణ గండలేఖ ముచ్ఛ్వాసికాలాంజనరాగమక్ష్ణోః
వధూముఖంక్లాంత యవావతంస మాచారధూమ గ్రహణాద్బభూవ॥ 82

వధూం ద్విజప్రాహత వైషవత్సే వహ్నిర్వివాహం ప్రతికర్మసాక్షీ
శివేనభర్త్రా సహధర్మచర్యా కార్యాత్వయా ముక్తవిచారయేతి॥ 83

ఆలోచనాంతం శ్రవణేవితత్య పీతం గురోస్త ద్వచనం భవాన్యా
నిదాఘకాలోల్బణతాపయేవ మాహేంద్రమంభః ప్రథమం పృథివ్యా॥ 84

ధ్రువేణభర్త్రా ధ్రువదర్శనాయ ప్రయుజ్యమానా ప్రియదర్శనేన
సాదృష్ట ఇత్యాననమున్నమయ్య హ్రీసన్నకంఠీ కథమప్యువాచ॥ 85

ఇత్థం విధిజ్ఞేన పురోహితేన ప్రయుక్త పాణిగ్రహణోపచారౌ
ప్రణేమతుస్తౌ పితరౌ ప్రజానాం పద్మాసనస్థాయ పితామహాయ॥ 86

వధూర్విధాత్రా ప్రతినంద్యతేస్మ కల్యాణివీర ప్రసవాభవేతి
వాచస్పతిః సన్నపిసోష్టమూర్తౌ త్వాశాస్య చింతాస్తిమితోబభూవ॥ 87

ఎదురుకొనఁ జూపు చూపును ♦ చెదరునట్టి, కొంచెముగ నిల్చి మరలఁ జ ♦ లించునట్టి
యొండొరులఁ జూచువేడ్కఁచే ♦ నొప్పునట్టి, వారికన్నులు సిగ్గుచే ♦ వాలి వఱలె. 75

తలఁకి తద్దేహమునుజొచ్చి ♦ దాఁగియున్న, మరునితొలియంకురంబట్లు ♦ మెఱయుచుండు
ముదితకెంగేలు నయ్యష్ట ♦ మూర్తి వట్టె, క్షితిధరవరుండు చేరువఁ ♦ జేర్చి చూప. 76

మించుబోణికి సుమశరో ♦ మాంచమొదవె, వృషభకేతనుఁ వ్రేళుల ♦ వెలసెఁ జెమట
బాగుగా నిట్లు పాణిస ♦ మాగమమున, నిర్వురకుఁ బ్రేమ సమమయి ♦ పర్వె నపుడు.

పరిణయంబుల నన్యదం ♦ పతులదరిని, జెలఁగి నంతన యుత్తమ ♦ శ్రీలఁ గొలుపు
చుండుమహనీయు లైనయా ♦ యుభయులందు, నొప్పుకాంతిని సేమని ♦ చెప్ప నగును.

దంపతులు దీప్తిమంత మై ♦ తనరుచుండు, నగ్నిచుట్టుఁ బ్రదక్షిణ ♦ మాచరించి
కలిసి మేరుగిరీంద్రంబు ♦ బలిసి తిరుగు, పగలురేయి తెఱంగున ♦ వఱలి రపుడు. 79

ఒండొరుల నంటి చొక్కెడు ♦ సుమను శివుని, నగ్నిచుట్టును మువ్మాఱు ♦ నరుగఁ గొలిపి
ప్రజ్వలితవహ్నిలోన భ ♦ వానిచేతఁ, బేలలఁ బురోహితుం డంత ♦ వ్రేల్పఁ జేసె. 80

కమ్మగా నుండులాజధూ ♦ మమ్ము గౌరి, యంజలిని గొని గురునాజ్ఞ ♦ నాస్యమందుఁ
దాల్పఁ జెక్కిఁటఁ బర్విన ♦ దానిరేక, క్షణము చెవి నల్లకలువగాఁ ♦ గ్రాలుచుండె.

హోమధూమమ్ము మానిని ♦ మోముఁ గ్రమ్మ, నించుక చెమర్చి చెక్కిలి ♦ యెఱ్ఱవాఱెఁ
గనులయం దుండి కాటుక ♦ కరఁగి కారె, నవయవాభరణమ్మును ♦ జెవిని వాడె. 82

అమ్మరో! విను నీవివా ♦ హమ్మునందు, సాక్షి యియ్యగ్ని భర్తయా ♦ శంభుఁ గూడి
తొరఁగి చింతల ధర్మంబు ♦ తోఁ జరింపు, మనుచుఁ బెండ్లికుమార్తెకు ♦ వినిచెవిఁ బుఁడు.

కంటికొన నంటు చెవితోడ ♦ గౌరి యపుడు, గురునియయ్యుపదేశంబు ♦ గ్రోలెఁదమిని
వేసవిని దప్తమైనట్టి ♦ పృథివి తమిని, గురియుతొలివాననీళ్లను ♦ గ్రోలునట్లు. 84

ధ్రువునిదర్శింపు మని తను ♦ శివుఁడు ధ్రువుఁడు, భర్తప్రియదర్శనీయుఁడు ♦ పలుకగౌరి
యెంతయోకష్టమున ముఖ ♦ మెత్తి నుడివెఁ, గంటి నని సిగ్గుచే హీన ♦ కంఠ యగుచు.

ఇట్లు విధివిదుఁ డగుపురో ♦ హితుఁడుహితుఁడు, సాంగముగఁబరిణయమును ♦ జరపనంతఁ
బ్రజలజననీజనకు లౌభ ♦ వానిభవులు, పద్మపీఠికిఁ బ్రహ్మకుఁ ♦ బ్రణతు లైరి. 86

కనుము కల్యాణి వీరఁ డౌ ♦ తనయునంచుఁ, బెండ్లికూఁతును బ్రహ్మ దీ ♦ వించెఁ గాని
తాను వాక్కులపతి యయి ♦ తనరికూడ, మృడుని దీవింపఁ దోఁచక ♦ మిన్న కుండె.87

క్లృప్తోపచారాం చతురస్రవేదీం తావేత్యపశ్చాత్ కనకాసనస్థౌ
జాయాపతీ లౌకికమేషణీయ మార్ద్రాక్షతారోపణ మన్వభూతామ్॥ 88

పత్రాంతలగ్నై ర్జలబిందుజాలై రాకృష్టముక్తాఫలజాలశోభమ్
తయోరుపర్యాయతనాళదండ మాధత్త లక్ష్మీః కమలాతపత్రమ్॥ 89

ద్విధాప్రయుక్తేన చ వాఙ్మయేన సరస్వతీ తన్మిథునం నునావ
సంస్కారపూతేన వరం వరేణ్యం వధూం సుఖగ్రాహ్య నిబంధనేన॥ 90

తౌ సంధిషు వ్యంజితవృత్తిభేదం రసాంతరేషు ప్రతిబద్ధరాగమ్
అపశ్యతా మప్సరసాం ముహూర్తం ప్రయోగమాద్యం లలితాంగహారమ్॥ 91

దేవా స్తదంతే హరమూఢభార్యం కిరీటబద్ధాంజలయో నిపత్య
శాపావసానే ప్రతిపన్నమూర్తే ర్యయాచిరే పంచశరస్య సేవామ్॥ 92

తస్యాను మేనే భగవాన్ విమన్యు ర్వ్యాపార మాత్మన్యపి సాయకానాం
కాలప్రయుక్తా ఖలు కార్యవిద్భి ర్విజ్ఞాపనా భర్తృషు సిద్ధిమేతి॥ 93

అథ విబుధగణాం స్తా నిందుమౌళిర్విసృజ్య క్షితిధరపతికన్యా మాదదానః కరేణ
కనకకలశయుక్తం భక్తిశోభాసనాథం క్షితివిరచితశయ్యం కౌతుకాగారమాగాత్.

నవపరిణయ లజ్జాభూషణాం తత్ర గౌరీ
వదనమపహరంతీ తత్కృతాక్షేపమీశః
అపిశయనసఖీభ్యో దత్తవాచం కథంచిత్
ప్రమథముఖవికారై ర్హాసయామాస గూఢం॥ 95

ఇతి శ్రీకాళిదాసకృతౌ కుమారసంభవే మహాకావ్యే ఉమా
పరిణయో నామ సప్తమస్సర్గః.

వింతచెలొప్పుచతురస్రి ♦ వేదిమీఁదఁ, జారుకనకాసనంబునఁ ♦ గూరుచుండి
సతియుఁ బతియును బడసి రా♦చార మూట, నౌదలలఁ జల్లఁబడుతడి ♦ యక్షతలను.

ఆణిముత్యాలజల్లరు ♦ లట్లు చుట్టు, వారిబిందులు రేకుల ♦ జారునట్టి
పొడుగుగా నుంచుకాడచేఁ ♦ బొదలునట్టి, తమ్మిగొడు గిడె వారి కం ♦ దముగ లక్ష్మి.

అంత వాగ్దేవి ద్వివిధంబు ♦ లై వెలుంగు, శబ్దజాలమ్ము చే వారి ♦ సంస్తుతించె
వరునిసంస్కారపూత మా ♦ భాషచేత, గిరిజ నతిసుఖమైనప్రా ♦ కృతముచేత. 90

సంధులకు నర్హమైనట్టి ♦ శైలిఁ గూర్చి, రాగరసములఁ దగినట్లు ♦ రక్తిఁ గలిపి
యభినయముతోడ నప్సర ♦ లాడినట్టి, ప్రథమనాటక మొక్కెంత ♦ వారు గనిరి. 91

అమరు లంజలి మకుటంబు ♦ లందుఁ గూర్చి, భార్యతోఁగూడియుండెడు ♦ భవునకెలఁగి
ముగిసి శాపంబు దేహంబుఁ ♦ బొందియున్న, పంచశరుసేవఁ గొనవిన్న ♦ వించిరపుడు.

హరుఁడు తనమీఁద నయితము ♦ శరముమరుఁడు, గొలుపుటకుస్వీకరించెను ♦ గోపముడిగి
కాలమును జూచి కార్యంబు ♦ కార్యవిదులు, ప్రభువులకు విన్నవించినఁ ♦ బండకున్నె.

అంత నమరాళి వీడి శ ♦ శాంకమౌళి, శైలరాట్పుత్రికామణి ♦ కేలు వట్టి
స్వర్ణకలశము, పానుపు ♦ వఱలువింత, లమరియుండెనుశయ్యాగృ ♦ హమ్ముఁ జేరె. 94

ఉత్సాహము. క్రొత్తపెండ్లికూఁతు రొటఁ ♦ గొన్నసిగ్గునన్ ముఖం
బెత్తఁ ద్రిప్పుదానిఁ జెలుల ♦ కెంతొకష్టమునను దా
నుత్తరంబు నిచ్చుదాని ♦ నుమను భృంగిచేష్టలన్
జిత్తమందె నవ్వునట్లు ♦ చేసె నీశ్వరుం డటన్. 95

గద్య.

ఇది శ్రీపరమేశ్వరకరుణాఫలిత లలితకవితాకలిత శ్రీరామలక్ష్మాంబా
బుచ్చివేంకయామాత్యతనూజాత సకలసజ్జనవిధేయ ఆదిపూడి
సోమనాథనామధేయప్రణీతం బయినయాంధ్రకుమార
సంభవమునందు నుమాపరిణయం
బనుసప్తమాశ్వాసము.



శ్రీ

# కుమారసంభవమ్.



## అష్టమస్సర్గః.



పాణిపీడన విధేరనంతరమ్ శైలరాజ దుహితుర్హరం ప్రతి
భావసాధ్వసపరిగ్రహాదభూత్ కామదోహ దమనోహరం వపుః॥ 1
వ్యాహృతా ప్రతివచోన సందధే గంతుమైచ్ఛద వలంబితాంశుకా
సేవతేస్మ శయనం పరాఙ్ముఖీ సాతథాపిరతయే పినాకినః॥ 2
కైతవేన శయితే కుతూహలాత్ పార్వతీప్రతిముఖం నిపాతితమ్
చక్షురు న్మిషతి సస్మితంప్రియే విద్యుదాహతమివ న్యమీలయత్॥ 3
నాభిదేశనిహితః సకంపయా శంకరస్య రురుధేతయాకరః
తద్దుకూల మథచా భవత్స్వయమ్ దూరముచ్ఛ్వసితనీవిబంధనమ్॥ 4
ఏవమాలిని గృహీతసాధ్వసమ్ శంకరోరహసి సేవ్యతామితి
సాసఖీచిరుపదిష్టమా కులా నాస్మరత్ప్రముఖవర్తినిప్రియే॥ 5
అప్యవస్తునికథాప్రవృత్తయే ప్రశ్న తత్పరమనంగ శాసనం
వీక్షితేన పరివీక్ష్యపార్వతీ మూర్ధకంపమయ ముత్తరందదౌ॥ 6
శూలినః కరతలద్వయేనసా సన్నిరుధ్య నయనేహృతాంశుకా
తస్యపశ్యతి లలాటలోచనే మోఘయత్న విధురా రహస్యభూత్॥ 7
చుంబనేష్వధరదానవర్జితం స్విన్నహస్త సదయోపగూహనం
క్లిష్టమన్మథ మపిప్రియంప్రభోర్దుర్లభ ప్రతికృతం వధూరతం॥ 8
యన్ముఖగ్రహణ మక్షతాధరమ్ దానమవ్రణపదం నఖస్యయత్
యద్రతంచ సదయం ప్రియస్యతత్ పార్వతీ విషహతేస్మ నేతరత్॥ 9



శ్రీ

# కుమారసంభవము.



## అష్టమాశ్వాసము.



### గీతములు.

జరిగ నివ్విధి పెండిలి ♦ శంకరునకు, వలపు వెఱపులు మదిలోనఁ ♦ గలిసి యుండు
గౌరి రతిదీపనం బగు ♦ కాయ మప్పు, డెంతయు మనోహరం బయి ♦ యెసఁగుచుండె. 1
ఎంత పిల్చిన నుత్తరం ♦ బియ్యకుండుఁ, గొంగు వట్టినఁ బోవఁగ ♦ డంగుచుండుఁ
బండినను బెడమోముతోఁ ♦ బండుచుండు, నైన ముదమిడుచుండెను ♦ హరున కామె.
పాన్పుపై నిద్రవోయెడు ♦ పగిది నుండు, ప్రియున కెదురుగ మోమును ♦ బెట్టగౌరి
హరుఁడు నవ్వుచుఁ గనువిప్పె ♦ నామె కనులు, మూసికొనె మించు సోఁకిన ♦ మాయు నట్లు.
నాభి కడఁ జేర్పఁ దెచ్చెడు ♦ నాథు కరము, గిరిజ వణఁకుచుఁ దా నడ్డ ♦ గించెఁ గాని
పోఁకముడి వీడిపోయి య ♦ ప్పొలఁతి చీరె, తాను గా జాఱిపోయెను ♦ దక్షిణంబ. 4
నెచ్చెలీ శంకరునితోడ ♦ నిర్భయముగ, సలుపు మేకాంతకేళి నీ ♦ సరణి నంచు 4
ననుఁగుఁజెలికత్తియలు సేసి ♦ నట్టిబోధ, మఱచెఁ బ్రియుఁ డెదురైనచో ♦ మదిగలంగి.
మారహరుఁ డగుప్రియుఁడు దక్ ♦ మాటలాడఁ, గొలుపనేదేదియో వస్తు ♦ వులను గూర్చి
యడుగుట యెఱింగి పార్వతి ♦ యతని జూచి, త్రిప్పెఁ దల నేమి వలదని ♦ చెప్పునట్లు.
గౌరి తనచీరె తొలఁగ నే ♦ కాంతమందు, రెండుచేతులతోఁ బ్రియు ♦ రెండు కనుల
గట్టిగా మూసె మూఁడవ ♦ కంటఁ జూడ, విన్నవోయెను యత్నంబు ♦ విఫలమగుట.
మోవి ముద్దిడఁగా నీని ♦ ముట్టనీని, బిగికవుఁగలీని ప్రతికృతి ♦ వెలయనీని
గిరిజరతి మెంతక్లిష్ట మై ♦ పరగుచున్న, హరున కది ప్రీతికరమయి ♦ వఱలుచుండె. 8
ప్రియుఁడు నొక్కొక మోవి చుం ♦ బించునట్టి, యట్టె గిల్లక కొనగోట ♦ నఁటు నట్టి
మృదుతరం బగురతము నే ♦ మెలఁతమిన్న, యోర్చనేకాని యుతరంబు ♦ నోర్చదయ్యె.

రాత్రివృత్తమనుయోక్తుముద్యతం సాప్రభాత సమయేసఖీజనమ్
నాకరోదపకుతూహలం హ్రియా శంసితుంతు హృదయేనతత్వరే॥

దర్పణేచ పరిభోగదర్శినీ పృష్ఠతః ప్రణయినోనిషేదుషః
ప్రేక్ష్యబింబ మపబింబ మాత్మనః కానికానినచకార లజ్జయా॥

నీలకంఠపరిభుక్తయౌవనాం తాంవిలోక్య జననీ సమాశ్వసత్
భర్తృవల్లభతయా హిమానసీం మాతురస్యతి శుచం వధూజనః॥

వాసరాణికతి చిత్కథంచన స్థాణునారతమకారిచానయా
జ్ఞాతమన్మథరసా శనైః శనైః సాముమోచరతిదుఃఖశీలతామ్॥

సస్వజే ప్రియమురోనిపీడనం ప్రార్థితం ముఖమనేన నాహరత్
మేఖలా ప్రణయలోలతాం గతం హస్తమస్య శిథిలం రురోధసా॥

భావసూచిత మదృష్టవిప్రియం దార్ఢ్యభాక్క్షణ వియోగకాతరమ్
కైశ్చిదేవ దివసైస్తథాతయోః ప్రేమగూఢ మితరేతరాశ్రియమ్॥

తం యథాత్మ సదృశంవరంవధూ రన్వరజ్యతవరస్తథైవతామ్
సాగరాదనపగాహి జాహ్నవీ సోపితన్ముఖర సైకవృత్తిభాక్॥

శిష్యతాం నిధువనోపదేశినః శంకరస్య రహసిప్రపన్నయా
శిక్షితం యువతినైపుణం తయా యత్తదేవ గురుదక్షిణీకృతమ్॥

దష్టముక్త మధరోష్ఠమంబికా వేదనా విధుతహస్త పల్లవా
శీతలేన నిరవాపయత్ క్షణం మౌళిచంద్రశకలేనశూలినః॥

చుంబనాదలకచూర్ణ దూషితం శంకరోపినయనం లలాటజమ్
ఉచ్ఛ్వసత్ కమలగంధయేదదౌ పార్వతీవదన గంధవాహినే॥

ఏవమింద్రియసుఖస్య వర్త్మనః సేవనా దనుగృహీత మన్మథః
శైలరాజ భవనే సహోమయా మాసమాత్రమవస ద్వృషధ్వజః॥

సోనుమాన్య హిమవంతమాత్మభూ రాత్మజావిరహ దుఃఖఖేదితమ్
తత్రతత్ర విజహారసంపత న్నప్రమేయ గతినాకకుద్మనా॥

మేరుమేత్య మరుదాశుగోక్షకః పార్వతీస్తన పురస్కృతః కృతీ
హేమపల్లవవిభంగసంస్తరా నన్వభూత్సురత మర్దనక్షమాన్॥

వేకువను రాత్రి జరగిన ♦ వృత్తమెల్ల, యెఱుఁగవచ్చినచెలులకు ♦ నెఱుకపఱుపఁ
జిత్త మెంతగఁ గోల్పిన ♦ సిగ్గుచేత, గౌరి తదభీప్సితము దీర్ప ♦ నేర దయ్యె. 10

అద్దమున నుపభోగచి ♦ హ్నములఁ జూచు, తఱి వెనుక వచ్చినిల్చిన ♦ ధవుని బింబ
మాత్మబింబమువెనుకను ♦ నలరఁ గాంచి, సిగ్గుచే నుమ చేయని ♦ చేష్ట లున్నె. 11

ఆమె యౌవనమును హరుఁ ♦ డనుభవింపఁ, గాంచి సంతుష్టురా లయి ♦ కౌఁగిలె జనని
పతికి ననురాగపాత్ర యౌ ♦ సుతయె కాదె, మాతమదిలోనిశోకంబు ♦ మాఁపు జగతి.

ఎంతయొకష్టతరముగా ♦ నీశ్వరుండు, గౌరితో రతి కొన్నాళ్లు ♦ గడప నిట్లు
నాఁడునాఁటికి మన్మథా ♦ నంద మెఱిఁగి, క్రమముగా వీడె రతిని దుః ♦ ఖంబు గిరిజ.

గట్టిగాఁ గౌఁగిలించినఁ ♦ గడు సహించె, నధరమును గోరఁ ద్రిప్పక ♦ యట్లె యుంచె
హరుఁడు మొలనూటఁ జేర్చిన ♦ కరము నామె, యడ్డి యడ్డనియట్లు దా ♦ నడ్డగించె.

అప్రియము వీడి సరసచే ♦ ష్టాళిఁ గూడి, యొకక్షణమైన నెడఁబాటు ♦ నోర్వకుండి
యొండొరులయాశ్రయంబున ♦ నొప్పుప్రేమ, తిరముఁగొనె వారిలోఁగొన్ని ♦ దినములందె.

వధువుతనతోడఁ దుల్యుఁడౌ ♦ వరుని నెట్లొ, వధువునట్టులె ప్రేమించె ♦ వరుఁడుగూడ
గంగ కడలికి ననుకూల ♦ గామియైన, నబ్ధియును దన్మధురసంబె ♦ యానుఁ గాదె. 16

తనకు సురతోపదేష్ట యై ♦ తనరుశివుని, కేకతంబుగ శిష్యత్వ ♦ మెలమిఁ గాంచి
పూనిక నేర్చినసురతమై ♦ పుణ్యమెల్ల, నగజ గురుదక్షిణగ నిచ్చె ♦ సతని కపుడు. 17

అధరమును బంటిచే నొక్క ♦ హరుఁడు విడువ, బాధ కాడించుచుమహస్త ♦ పల్లవంబు
శంకరునితల నొప్పెడు ♦ చల్లనైన, చందురునిరేకచే శాంతి ♦ క్షణము వడసె. 18

అధర మానంగ నలకమా ♦ ర్జాలి రాలి, చాలఁ గలఁగినఫాలలో ♦ చనము శివుఁడు
వికచపద్మసుగంధమ్ము ♦ వెలికిఁ జిమ్మ, సుదతివదనానిలంబున ♦ కెదుట నిడియె. 19

గౌరితోఁ గూడి విషయసౌ ♦ ఖ్యమ్ము లిట్టు, లనుభవించుచు మారుని ♦ గనికరించి
మాసమాత్రము వసియించె ♦ మామ యైన, శైలరాజేంద్రునింట వృ ♦ షధ్వజుండు. 20

కూఁతు నెడఁబాయుదుఃఖంబు ♦ చేతఁ గుందు, నాహిమగిరీంద్రుననుమతి ♦ నందిశివుఁడు
కామగతిఁ గ్రాలుచుండుపుం ♦ గవము నెక్కి, సేయఁదొడఁగె విహారంబు ♦ స్వేచ్ఛగాను.

వాయువేగానఁ జనువృష ♦ భంబుమీఁద, గిరిసుతాకుచయుగపుర ♦ స్కృతుఁడు సుకృతి
కనకగిరిఁ జేరి సురతమ ♦ గ్నము నోర్చు, పైఁడిచిగురులపాన్పునఁ ♦ బడసె సుఖము. 22

పద్మనాభచరణాంకితాశ్మసు ప్రాప్తవత్స్వమృత విప్రుషోనవాః
మందరస్యకటకేషుచావసత్ పార్వతీవదన పద్మషట్పదః॥ 23

రావణధ్వనిత భీతయాతయా కంఠసక్త దృఢబాహుబంధనః
ఏకపింగల గిరౌజగద్గురు ర్నిర్వివేశ విశదాః శశిప్రభాః॥ 24

తస్యజాతు మలయస్థలీరతే ర్ధూతచందనలతః ప్రియాక్లమమ్।
ఆచచామస లవంగకేసర శ్చాటుకార ఇవదక్షిణానిలః॥ 25

హేమ తామరస తాడితప్రియా తత్కరాంబు వినిమీలితేక్షణా
సావ్యగాహత తరంగిణీముమా మీనపఙ్క్తి పునరుక్త మేఖలా॥ 26

తాం పులోమతనయాలకోచితైః పారిజాతకుసుమైః ప్రసాధయన్
నందనే చిరమయుగ్మలోచనః సస్పృహం సురవధూభి రీక్షితః॥ 27

ఇత్యభౌమ మనుభూయశంకరః పార్థివంచ దయితాసఖః సుఖమ్
లోహితా యతికదాచిదాతపే గంధమాదనవనం వ్యగాహత॥ 28

తత్రకాంచన శిలాతలాశ్రయో నేత్రగమ్య మవలోక్యభాస్కరమ్
దక్షిణేతర భుజవ్యపాశ్రయాం వ్యాజహార సహధర్మచారిణీమ్॥ 29

పద్మకాంతి మరుణత్రి భాగయోః సంక్రమయ్య తవనేత్రయోరివ
సంక్షయే జగదివప్రజేశ్వరః సంహరత్య హరసావహర్పతిః॥ 30

సీకరవ్యతికరం మరీచిభి ర్దూరయత్యవనతే వివస్వతి
ఇంద్రచాప పరివేషశూన్యతాం నిర్ఝరాస్తవ పితుర్వ్రజంత్యమీ॥ 31

దష్టతామరస కేసరస్రజోః క్రందతో ర్విపరివృత్తకంఠయోః
నిఘ్నయోస్సరసి చక్రవాకయో రల్పమంతర మనల్పతాం గతం॥ 32

స్థానమాహ్ని కమపాస్యదంతినః సల్లకీవిటప భంగవాసితం
ఆవిభాతచరణాయ గృహ్ణతే వారివారిరుహ బద్ధషట్పదం॥ 33

పశ్యపశ్చిమదిగంతలంబినా నిర్మితం మితకథే వివస్వతా
లబ్ధయా ప్రతిమయా సరోంభసాం తాపనీయ మివసేతు బంధనం॥ 34

ఉత్తరంతి వినికీర్య్యపల్లవం గాఢపంక మతివాహితాతపాః
దంష్ట్రిణోవ నవరాహయూథపా దష్టభంగుర బిసాంకురా ఇవ॥ 35

ఏషవృక్షశిఖరే కృతాస్పదో జాతరూపరసగౌరమండలః
హీయమాన మహరత్యయాతపం పీవరోరు పిబతీవ బర్హిణః॥ 36

పూర్వభాగ తిమిరప్రవృత్తిభి ర్వ్యక్తపంకమివజాత మేకతః
ఖంహృతాతపజలం వివస్వతా భాతికించిదివ శేషవత్సరః॥ 37

ఆవిశద్భిరుటజాంగణం మృగై ర్మూలసేకసరసైశ్చ వృక్షకైః
ఆశ్రమాః ప్రవిశదగ్నిధేనవో బిభ్రతిశ్రియము దీరితాగ్నయః॥ 38

బద్ధకోశమపితిష్ఠతి క్షణం సావశేషవివరం కుశేశయమ్
షట్పదాయవసతిం గ్రహీష్యతే ప్రీతిపూర్వమివదాతు మంతరమ్॥ 39

దూరమగ్నపరిమేయరశ్మినా వారుణీ దిగరుణేన భానునా
భాతికేసరవ తేవమండితా బంధుజీవతిలకేన కన్యకా॥ 40

సామభిః సహచరాః సహస్రశః స్యందనాశ్వ హృదయంగమస్వనైః
భానుమగ్ని పరికీర్ణతేజసం సంస్తువంతి కిరణోష్మపాయినః॥ 41

సోయమానత శిరోధరైర్హయైః కర్ణచామరవిఘట్టితేక్షణైః
అస్తమేతి యుగభుగ్నకేసరైః సన్నిధాయదివసం మహోదధౌ॥ 42

ఖం ప్రసుప్తమివ సంస్థితేరవౌ తేజసోమహత ఈదృశీగతిః
తత్ప్రకాశయతి యావదుద్గతం మీలనాయ ఖలుతావదచ్యుతమ్॥ 43

సంధ్యయాప్యనుగతం రవేర్వపు ర్వంద్యమస్త శిఖరే సమర్పితమ్
యేనపూర్వ ముదయే పురస్కృతా నాను యాస్యతికథం తమాపది॥ 44

రక్తపీతకపిశాః పయోముచాం కోటయః కుటిలకేశిభాంత్యమూః
ద్రక్ష్యసిత్వమితి సంధ్యయానయా వర్తికాభి రివసాధుమండితాః॥ 45

సింహకేసరసటాసు భూభృతాం పల్లవప్రసవిషు ద్రుమేషుచ
పశ్యధాతు శిఖరేషు భానునా సంవిభక్త మివసాంధ్యమాతపమ్॥ 46

అద్రిరాజతనయే తపస్వినః పావనాంబు విహితాంజలి క్రియాః
బ్రహ్మగూఢమభిసంధ్యమాదృతాః శుద్ధయే విధివిదో గృణంత్యమీ॥ 47

తన్ముహూర్త మనుమంతు మర్హసి ప్రస్తుతాయ నియమాయ మామపి
త్వాం వినోదనిపుణః సఖీజనో వల్గువాదిని వినోదయిష్యతి॥ 48

పురులు బంగారురసముతోఁ ♦ బూసినట్లు, పచ్చగా వెల్గుచుండఁగా ♦ బర్హి యదిగొ
తరువుపైఁ గూరుచుండెను ♦ దరుణి! చూడు, తగ్గుచుండెడు నీరెండఁ ♦ ద్రాగునట్లు.

ఎండ యనునీరు రవిహరి♦యించి యుండఁ, దూర్పుదిక్కునఁ దిమిరంబు♦తోఁచుచుండ
వఱలె నంబర మొకదెసఁ ♦ బంకముండి, సలిల మించుక మిగిలిన ♦ సరసిమాడ్కి. 37

హరిణములు నేరెఁ బర్ణశా ♦ లాంగణముల, మొక్కలకు నీరు వోసిరి♦మొదలు దడియ
మొదవులరుదెంచె హోమాగ్ని ♦ పొదలఁ జొచ్చె, నాశ్రమావళి యెంతయు ♦ నలరఁ దోడఁగ

వసతికై కోరి వచ్చెడు ♦ భ్రమరమునకు, నెంతయును బ్రీతి నవకాశ ♦ మిచ్చుటకును
వేచియున్నదో యనఁ గొంత♦విచ్చియుండె, మోడ్పు నున్నను దామర ♦ పూవుచూడు.

ఎంచ నగునన్ని కిరణముల్ ♦ గాంచియున్న, యరుణభానునితో నొప్పు ♦ నపరదిక్కు—
విశదకేసరములతోడ ♦ వెలయుచుండు, మంకెనను బొట్టుగా నిడ్డ ♦ ముగువఁ బోలె. 40

వేఁడికిరణమ్ములను గ్రోలి ♦ వెంటఁ దిరుగు, మునివరులు వహ్నిలోఁ దేజ ♦ మునిచినట్టి
తరణిఁ బొగడఁదొడంగిరి ♦ తద్రథాశ్వ, సమితి చెలఁగురవమ్ముల ♦ సామములను. 41

వంగ శిరములు కాఁడిచే ♦ వాలజాలు, కర్ణచామరములు పడి ♦ కనులు మూయఁ
క్రుంకు గుఱ్ఱాలతో రవి ♦ క్రుంకె నదిగొ, పగటినంతను వార్ధిలో ♦ పలను ముంచి. 42

దివము నిద్రించినట్లుండె ♦ రవి మునుంగ, నుచ్చతేజముగతి యిట్టు ♦ లుండు జగతిఁ
బుట్టి తాఁ దేజు గోల్పిన ♦ యట్టియెడకె, నించుఁ దమమును దానస్త ♦ మించునపుడు. 43

సంధ్య మైయస్తగిరిఁ బెట్టఁ ♦ బడినయట్టి, యరుక్కనగమ్ముతో సంధ్య ♦ యనుగమించెఁ
బూర్వ మభ్యుదయంబునఁ ♦ బొలిచి వెంట, నాపదనుగూడ నతనితో ♦ నరుగకున్నె.

చూతువలె నీవు తూలికల్ ♦ చేతఁ బూని, సంధ్యచిత్రాళి గూర్చిన ♦ చందమునను
కుటిలకుంతల! యంబుద ♦ కోటు లవిగొ, పలు తెఱంగులరంగులఁ ♦ బరిఢవిల్లె. 45

సింహకేసరములధాతు ♦ శిఖరములను, బూచి చిగిరిచియున్నట్టి ♦ భూజములను
దనదు నీరెండ భానుండు ♦ చనెడునపుడు, పంచిపెట్టెనో యనఁదోఁచెఁ ♦ బడఁతి చూడు.

సంజకెదుట యథావిధి ♦ శైలతనయ, యమలజలములఁ దాపసు ♦ లర్ఘ్య మిచ్చి
యాత్మను బవిత్ర మొనరించు ♦ నాస్థచేత, లోన గాయత్రి జపియింపఁ ♦ బూని రదిగొ.

కానఁ గాలోచితములను ♦ గడప నాకు, క్షణము సెలవియ్య నీకు యో♦గ్యమ్ము సుమ్ము.
నిన్నును వినోదములయందు ♦ నిపుణలైన, చెలులు సంతోషపఱతురు ♦ లలితవాణి!

నిర్విభుజ్య దశనచ్ఛదం తతో వాచి భర్తురవధీరణాపరా
శైలరాజతనయా సమీపగా మాలలాప విజయామహేతుకమ్॥ 49

ఈశ్వరోపి దివసాత్యయోచితం మంత్రపూర్వ మనుతస్థివాన్విధిమ్
పార్వతీమవచనా మసూయయా ప్రత్యుపేత్య పునరాహ సస్మితమ్॥ 50

ముంచకోపమ నిమిత్తకోపనే సంధ్యయా ప్రణమితోస్మి నాన్యయా
కింనవేత్సి సహధర్మచారిణం చక్రవాక సమవృత్తి మాత్మనః॥ 51

నిర్మితేషు పితృషు స్వయంభువా యాతనుః సుతను పూర్వముజ్ఝితా
సేయమస్తముదయంచ సేవతే తేనమానిని మమాత్రగౌరవమ్॥ 52

తామిమాంతిమిరవృద్ధిపీడితాం శైలరాజతనయే ధునాస్థితామ్
ఏకతస్తట తమాలమాలినీం పశ్యధాతురస నిమ్నగామివ॥ 53

సాంధ్యమస్త మితశేషమాతపం రక్తలేఖమ పరాబిభర్తిదిక్
సంపరాయ వసుధాసశోణితం మండలాగ్రమివతిర్యగుజ్ఝితమ్॥ 54

యామినీదివససంధిసంభవే తేజసి వ్యవహితే సుమేరుణా
ఏతదంధతమసం నిరంకుశం దిక్షుదీర్ఘనయనే విజృంభతే॥ 55

నోర్ధ్వమీక్షణ గతిర్నచాప్యధో నాభితో నపురతో నపృష్ఠతః
లోకఏవ తిమిరౌఘ వేష్టితో గర్భవాస ఇవవర్తతేనిశి॥ 56

శుద్ధమా విలమవస్థితం చలం వక్రమార్జవ గుణాన్వితం చయత్
సర్వమేవ తమసాసమీకృతం ధిఙ్మహత్త్వ మసతాం హృతాంతరం॥ 57

నూనమున్నమతి యజ్వనాంపతిః శార్వరస్య తమసో నిషిద్ధయే
పుండరీకముఖి పూర్వదిఙ్ముఖం కైతకైరివరజోభిరాహతం॥ 58

మందరాంతరితమూర్తినానిశా లక్ష్యతే శశభృతాసతారకా
త్వంమయా ప్రియసఖీసమాగతా శ్రోష్యతేవ వచనానిపృష్ఠతః॥ 59

రుద్ధనిర్గమనమాదినక్షయాత్ పూర్వదృష్టతను చంద్రికాస్మితం
ఏతదుద్గిరతిచంద్రమండలం దిగ్రహస్యమివ రాత్రినోదితం॥ 60

పశ్యపక్వఫలినీ ఫలత్విషా బింబలాంఛిత వియత్సరోంభసా
విప్రకృష్టవివరం హిమాంశునా చక్రవాకమిథునం విడంబ్యతే॥ 61

అనినఁ జెదవిని విఱిచి య ♦ య్యద్రితనయ, ధవునిమాటలవైపున ♦ ధ్యాన మిడక
సరసఁ జేరినవిజయ యన్ ♦ సకియతోడ, నుద్దు లెవ్వియొ పలుకంగఁ ♦ జొచ్చెనపుడు.

శంకరుఁడుఁగూడ దివసావ ♦ సానవిధుల, మంత్రపూర్వకముగఁ దీర్చి ♦ మరల వచ్చి
యలుకచే మాటలాడని ♦ యగతనూజ, తోడ నవ్వుచు నిట్లు మా ♦ టాడఁదొడఁగె.

కారణము లేక కోపమ్ము ♦ గన్నమగువ!, యలుక విడు; సంధ్యకేకాని ♦ యన్య కెఱఁగ;
జక్కవను బోలుసహధర్మ ♦ చారి నంచుఁ, జెలువరో! యేలఁ దెలియవు ♦ తెలియవేల?

పితరుల సృజించి పరమేష్ఠి ♦ వీడినట్టి, గాత్రమే సంధ్యరూప మై ♦ కాంతిసుగాత్రి
గాన నుదయాస్తములయందు ♦ నేను దాని, నాత్మ సేవింతు గౌరవ ♦ మని తలంతు. 52

పర్వుచీఁకట్లఁ గలపంగఁ ♦ బడినసంజ, యేకతటమునఁ జీఁకటి ♦ మాఁకు లుండ
సొంపుమీఱెడు ధాతుర ♦ సంపులేఱు, కరణి నున్నది చూడు మో ♦ గిరితనూజ! 53

అదిగో కంటివె నీరెండ ♦ యస్తమింప, నరుణరేఖను దాల్చిన ♦ యపరదిక్కు
నడ్డముగ నెత్తఁబడి నెత్తు ♦ రంటి యున్న, కత్తిఁ దాల్చినసంగరాం ♦ గణముఁ బోలె.

రాత్రికిని బగటికిమధ్యఁ ♦ గ్రాలుసంజ, వెలుతు రంతయు మేరువు ♦ వెనుక నణఁగ
దీర్ఘలోచన! చీఁకటుల్ ♦ దిక్కులందు, నలముకొనఁ జొచ్చెఁ జూడు ని ♦ రంకుశముగ.

ముందు వెనుకను బైఁ గ్రింద ♦ నెందు నిశిని, గన్నులకుఁ గానరానిలో ♦ కమ్ము గౌరి!
యావరించినచీఁకటి ♦!యందు నుంట, గర్భకోశమ్మునం దుండు ♦ కరణిఁ దోఁచె. 56

సరళవక్రచరస్థిర ♦ సమలవిమల, మనుగుణములెల్లఁ దమమునఁ ♦ గనెను సమత
ధరణిలోఁ దారతమ్యమ్ము ♦ లెఱుఁగనట్టి, యల్పునభివృద్ధి కరము గ ♦ ర్వ్యమ్ము సుమ్ము.

కటికిచీఁకటి మాపఁగాఁ ♦ గళలఱేఁడు, పొడువఁ దొడఁగినఁ దెల్లఁగాఁ ♦ బూర్వదిక్కు
మొగిలుపుప్పొడి మోమునఁ ♦ బూసికొన్న, కరణిఁ గన్పట్టెఁ జూడు మో ♦ కమలసదన.

రిక్కలను గూడి ముం దుండ ♦ రేవెలంది, మందరము వెనుకనుండి నీ ♦ [illegible]
చెలులతో గౌరి! నీ వాడు ♦ పలుకులెల్ల, వెనుక వినువేడ్క నిల్చిన ♦ [illegible]

ప్రాగ్దిశ రహస్యమును సంజ ♦ వఱకు దాఁచి, రేయి పురికొల్ప వెలిఁబుచ్చె ♦ [illegible]
నిగనిగల నీనువెన్నెల ♦ నగవుతోడఁ, జంద్రు వెలిఁబుచ్చెఁ జూచితే ♦ శైల[illegible]

నింగిఁ దొలఁకున విలసిల్లు ♦ నీటియందుఁ, బక్వఫలినీఫలద్యుతి ♦ వఱలు చుండు
ప్రతిఫలముతోడిచంద్రబిం ♦ బమ్ము మగువ, కంటె విచ్చినజక్కవ ♦ కవను బోలె. 61

శక్యమోషధిపతే ర్నవోదయాః కర్ణపూరరచనాకృతేతవ
అప్రగల్భ యవసూచికోమలా శ్ఛేత్తుమగ్రనఖ సంపుటైః కరాః॥

అంగులీ భిరివ కేశసంచయం సన్నిగృహ్యతిమిరం మరీచిభిః
కుట్మలీకృత సరోజలోచనం చుంబతీవ రజనీ ముఖం శశీ॥

పశ్యపార్వతినవేందురశ్మిభి ర్భిన్న సాంద్రతిమిరం నభస్తలమ్
లక్ష్యతే ద్విరద భోగదూషితం సప్రసాదమివమానసంసరః॥

రక్తభావమపహాయ చంద్రమా జాతఏష పరిశుద్ధమండలః
విక్రియాన ఖలుకాలదోషజా నిర్మలప్రకృతిషు స్థిరోదయా॥

ఉన్నతేషు శశినః ప్రభాస్థితా నిమ్న సంశ్రయపరం నిశాతమః
నూనమాత్మసదృశీ ప్రకల్పితా వేధసాహి గుణదోషయోర్గతిః॥

చంద్రపాద జనితప్రవృత్తిభి శ్చంద్రకాంత జలబిందుభిర్గిరిః
మేఖలాంతరుషు నిద్రితానమూన్ బోధయత్య సమయే శిఖండినః॥

కల్పవృక్ష శిఖరేషుసంప్రతి ప్రస్ఫురద్భిరివపశ్యసుందరి
హారయష్టిరచనామివాంశుభిః కర్తుమాగత కుతూహలః శశీ॥

ఉన్నతావనత భావవత్తయా చంద్రికాసతిమిరాగిరేరియమ్
భక్తిభిర్బహు విధాభిరర్పితా భాతిభూతిరివ మత్తహస్తినః॥

ఏతదుచ్ఛ్వసిత పీతమైందవం వోఢుమక్షమమివ ప్రభారసమ్
ముక్తషట్పద విరావమంజసా భిద్యతే కుముదమా నిబంధనాత్॥

పశ్యకల్పతరులంబి శుద్ధయా జ్యోత్స్నయా జనితరూపసంశయమ్
మారుతేచలతి చండికేబలా ద్వ్యాజ్యయతే విపరివృత్తమంశుకమ్॥

శక్యమంగులిభి రుత్థితైరథః శాఖినాంపతిత పుష్పపేశలైః
పత్త్రజర్జర శశిప్రభాలవై రేభిరుత్కచయితుం తవాలకాన్॥

ఏషచారుముఖి యోగ్యతారయా యుజ్యతేతరల బింబయాశశీ
సాధ్వసాదుపగతప్రకంపయా కన్యయే వనదీక్షయావరః॥

పాకభిన్న శరకాండ గౌరయో రుల్లసత్ప్రకృతి జప్రసాదయోః
రోహతీవతవ గండలేఖయో శ్చంద్రబింబ నిహితాక్షిచంద్రికా॥

క్రొత్తనియవాంకురములట్లు ♦ కోమలంబు, లైనక్రొన్నెలకిరణంబు ♦ లతిశయమిన్న
కర్ణపూరము లయి నీకుఁ ♦ గ్రాలుటకును, ద్రుంపఁ గొనగోట ననువు లై ♦ తోఁచె నివిగో.

వెలయుకిరణాళి యనుతన ♦ వ్రేళ్లచేతఁ, దిమిరకుంతలముల నట్టె ♦ తమినిబట్టి
ముకుళితాంబుజనేత్ర యై ♦ పొలుచు రేయి, మోము ముద్దాడుగతిఁ జంద ♦ మామ దోఁచె.

కరులు నీరాడ నెంతయుఁ ♦ గలకఁ జెంది, మరలఁ దేఱినమానస ♦ సరము మాడ్కిఁ
దమము క్రొన్నెలమినుకులఁ ♦ దలఁగిపోవ, నభము నిర్మల మై యుండె ♦ నగతనూజ. 64

చంద్రమండల మెఱ్ఱని ♦ ఛాయ వీడి, యెంతయును శుభ్రముగఁ బొల్చెఁ ♦ గాంత చూడు
కాలదోషజ మైనవి ♦ కార మున్నె, పోయకుండఁగ నిర్మల ♦ ప్రకృతులందు. 65

ఉన్నతస్థలి వెన్నెల ♦ యొప్పఁ దొడఁగెఁ, బల్లమౌచోటఁ జీఁకటి ♦ పర్వఁ జొచ్చె
ధరణి గుణదోషములకెల్లఁ ♦ దగినయట్లు, గతులఁ గల్పించియున్నాఁడు ♦ గా విధాత.

చంద్రకిరణాళిచేతను ♦ జంద్రకాంత, శిలల జనియించుజలబిందు ♦ వులను శిఖరి
మేలుకొలిపెను గంటె య ♦ కాలమందుఁ, జేరి చఱిచెట్లఁ బండుమ ♦ యూరములను.

మించుమినుకులచే నయి ♦ మెఱయుచుండు, విమలమణిహారములఁ గల్ప ♦ వృక్షలతల
కొసలఁ గూర్చుకుతూహల ♦ మున నొయనఁగఁ, జందురుఁడు వచ్చెఁ జూడు మో ♦ సుందరాంగి.

ఎగుడుదిగుడులు గలుగునీ ♦ నగముమీఁద, వెన్నెలలు చీఁకటులఁ గూడి ♦ వెలయుచుంటఁ
జిత్రముగ నెంతయును గయి ♦ సేయఁబడిన, గంధగజవైభవశ్రీల ♦ కరణి మెఱసె. 69

తద్దయును దమిఁ జంద్రికన్ ♦ దప్పద్రాగి, దాని నోరిచికొనలేని ♦ దానిఁ బోలెఁ
దొవయదిగొ విచ్చెఁ జూడుము ♦ తొడిమెదాఁక, నెంతయును భృంగనాదమ్ము ♦ లెసఁగుచుండ

వెన్నెలసురద్రుమంబున ♦ వ్రేలుచుండు, వలిపమున సందియంబును ♦ గొలుపుచుండ
గాలి వీవఁ దొడంగినఁ ♦ గదలఁ జొచ్చి, సంశయము వాపెఁ గంటివే ♦ యంశుకంబు.

క్రిందరాలినపువ్వుల ♦ యంద మొంది, యాకులకు మధ్య తునక లై ♦ యలరుచుండు
వెన్నెలలు వ్రేళ్లతోఁ దీసి ♦ వెలఁది నీదు, ముంగురులఁ జేర్ప ననువయి ♦ పొదలెఁ గనుము.

భీతిఁ గంపము గొనుక్రొత్త ♦ పెండ్లికూఁతు, ప్రోడఁ గూడెడువధువనట్లు ♦ తొగలఱేఁడు
తరళబింబముతో నొప్పి ♦ తనకుఁ దగిన, తారతోఁ గూడెఁ జూడుము ♦ చారువదన. 73

పర్వనీకంటివెన్నెల ♦ ప్రవిమలాంగి, పక్వశరకాండమట్టలు ♦ పైఁడిచాయ
గలిగి సహజము గాఁ జేట ♦ లాలుకునీమ, గండభాగములను బ్రాఁకు ♦ గతిని దోఁచెఁ.

లోహితార్క-మణి భాజనార్పితం కల్పవృక్షమధు బిభ్రతీస్వయమ్
త్వామియంస్థితి మతీముపాగతా గంధమాదనవనాధి దేవతా॥ 75

ఆర్ద్రకేసర సుగంధితేముఖం మత్తరక్తనయనం స్వభావతః
అత్రలంబవస తిర్గుణాంతరం కింవిలాసిని మదః కరిష్యతి॥ 76

మాన్యభక్తి రథవాసఖీజనః సేవ్యతా మిదమనంగదీపనమ్
ఇత్యుదార మభిధాయశంకర స్తామపాయ యతపానమంబికామ్॥ 77

పార్వతీ తదుపయోగసంభవాం విక్రియామపిసతాం మనోహరామ్
అప్రతర్క్య విధియోగనిర్మితా మామ్రతేవ సహకారతాం యయౌ॥ 78

తత్క్షణం విపరివర్తితహ్రియో ర్నేష్యతోః శయనమిద్ధరాగయోః
సాబభూవ వశవర్తినీ ద్వయోః శూలినః సువదనా మదస్యచ॥ 79

ఘూర్ణమాననయనం స్ఖలత్క-థం స్వేదబిందు మదకారణస్మితమ్
ఆననేన నతుతావదీశ్వర శ్చక్షుషాచిరము మాముఖంపపౌ॥ 80

తాం విలంబితపనీయ మేఖలా ముద్వహన్జఘనభారదుర్వహామ్
ధ్యానసంభృత విభూతిరీశ్వరః ప్రావిశన్మణిశిలా గృహంరహః॥ 81

తత్రహంస ధవళోత్తరచ్ఛదం జాహ్నవీపులిన చారుదర్శనమ్
అధ్యశేతశయనం ప్రియాసఖః శారదాభ్రమివ రోహిణీపతిః 82

క్లిష్టకేశమవలుప్తచందనం వ్యత్యయార్పితనఖం సమత్సరమ్
తస్యతచ్ఛిదుర మేఖలాగుణం పార్వతీరతమభూన్నతృప్తయే॥ 83

కేవలం ప్రియతమాదయాళునా జ్యోతిషామవనతాసు పంక్తిషు
తేన తత్పరిగృహీతవక్షసా నేత్రమీలన కుతూహలంకృతమ్॥ 84

సవ్యబుధ్యత బుధ స్తవోచితః శాతకుంభ కమలాకరైః సమమ్
మూర్ఛనా పరిగృహీత కైశికైః కింనరై రుషసి గీతమంగళః॥ 85

తౌక్షణం శిథిల తోపగూహనౌ దంపతీచలిత మానసోర్మయః
పద్మభేద పిశునాః సిషేవిరే గంధమాద నవనాంతమారుతాః॥ 86

ఊరుమూల నఖమార్గరాజభి స్తత్క్షణం హృతవిలోచనోహరః
వాససః ప్రశిథిలస్య సంయమం కుర్వతీం ప్రియతమా మవారయత్॥ 87

అర్కశిలనయి కెంజాయ ◆ నలరుచుండు, గిన్నెలో నాసవము నించి ◆ గిరిజ! యిచట
వెలసియుంచెదనినుసమీ ◆ పించె గంధ, మాదనవనాధిదేవత ◆ సాదరమున. 75

పడఁతి! నీవదనమ్ము స్వ ◆ భావముగనె, పచ్చికేసరియట్టులు ◆ పరిమళించుఁ
గనులు సహజముగా రక్త ◆ కాంతిఁ దనరు, నింక నీ కెక్కువగ మధు ◆ వేమిగూర్చు-

కేవలము భక్తితోడ స ◆ ఖీజనమ్ము, దెచ్చి యుంటను గామసం ◆ దీపనమ్ము
నగుటయును దీని సేవింపు ◆ మగజయంచు, సతికిఁ ద్రావించె మధువును ◆ శంకరుండు.

ఊహ కందనిదివ్యనా ◆ దోహదమున, మావి తీయనిమావిగా ◆ మాఱుకరణి
గౌరి మధుపానజన్యవి ◆ కారమునను, గడుమనోహర యయ్యె శం ◆ కరున కపుడు. 78

ఎంతయును సిగ్గు వదలించి ◆ యెలమిఁ గొల్పి, శయ్యకును జేర్పఁ గోరెడు ◆ శంభునకును
మఱియుఁ బైఁబయి మించెడు ◆ మదమునకును, క్షణములోపలవశమయ్యెఁ ◆ జంద్రవదన.

కడుసుడియునేత్రములుదడఁ ◆ బడెడునుడులు, మదపునవ్వులుచెమ్మటల్ ◆ పొదలుచుండు
నగజమోమును దనవద ◆ నమునఁ గాక, కనులచేఁ గ్రోలుచుండె శం ◆ కరుఁడు చిరము.

కడుజఘనభారమును గాంచి ◆ క్రాలునట్టి, ప్రేలుబంగారుమొలనూట ◆ వెలయునట్టి
గిరిజఁగౌనియొంటిమణిశిలా ◆ గృహముఁ జేర్చె, వలయుసిరులనుదలఁపుతోఁ ◆ బడయుశివుడు

అంచవోల్ తెల్లదుప్పటి ◆ నమరియుండి, గంగపులినంబుకరణిఁ జె ◆ లంగుశయ్య
నీశుఁ డుమతోడఁ బండె రో ◆ హిణినిగూడి, శారదఘనంబు పైఁ బండు ◆ శశివిధమున.

కురులు చెదరంగ, గందమ్ము ◆ చెఱఁగ, గోటి, నొక్కు లగుపడఁ దెగిమొల ◆ నూలుపడఁగ
పాలయలుకతోడఁ బార్వతిఁ ◆ గలఁచియెంత, పెనఁగిరమియించినను శూలి ◆ తనియఁడయ్యె.

తారకాపంక్తి మాసెడు ◆ తరుణమందుఁ, గేవలం బామెపై నుండు ◆ కృపను శివుఁడు
తనయురమ్మునఁ దత్ప్రియ ◆ తమను జేర్చి, నేత్రముల మోడ్చి సుఖముగా ◆ నిద్రవోయె.

వీణె మీటుచు మూర్ఛనల్ ◆ వెలయునట్లు, కిన్నరులు పాడ మంగళ ◆ గీతములను
మేలుకొనె స్వర్ణకమలాక ◆ రాళితోడ, వేకువను జంద్రభూషుఁడు ◆ విబుధనుతుఁడు. 85

తరగలఁ గదల్చి మానస ◆ సరమునందుఁ, దమ్ముల నలర్చి గంధమా ◆ దనమువనిని
వీచుమందానిలమ్ము సే ◆ వించి రెలమి, నిముస మాలింగనము మాని ◆ యుమయుశివుఁడు.

జఘనమూలనఖక్షత ◆ చయము వంకఁ, దమిని వేకువఁ గాంచెడు ◆ తన్నుఁ జూచి
తొలఁగియున్నట్టివలువను ◆ దొందరగను, గట్టుకొనుచుండు ప్రియను ము ◆ క్కంటియాఁపె.

సపరిజాగర కషాయలోచనం. గాఢదంత పరితాడితాధరం
ఆకులాలకమరంస్త రాగవాన్ ప్రేక్ష్యభిన్నతిలకం ప్రియాముఖం॥ 88

తేనభిన్న విషమోత్తరచ్ఛదం మధ్యపిండిత విసూత్రమేఖలం
నిర్మలేపిశయనం నిశాత్యయే నోజ్ఝితం చరణరాగలాంఛితం॥ 89

సప్రియాముఖరతం దివానిశం హర్షవృద్ధిజననం సిషేవిషుః
దర్శనప్రణయినా మదృశ్యతా మాజగామ విజయానివేదనాత్ ॥ 90

సమదివసనిశీథం సంగినస్తత్రశంభోః శతమగమదృతూనాం సార్ధమేకానిశేవ
నతుసురతముఖేభ్యశ్ఛిన్నతృష్ణోబభూవ జ్వలన ఇవ సముద్రాంతర్గతస్తజ్జలౌఘైః॥ 91

ఇతి శ్రీకాలిదాసకృతౌ కుమారసంభవే మహాకావ్యే ఉమా
రతవర్ణనం నామాష్టమస్సర్గః.



కనమి నిద్దుర నెట్టినా ♦ కనులతోడ, మోద మిడుపంటినొక్కుల ♦ మోవితోడఁ
జెడిన తిలకాలకములతోఁ ♦ జెలఁగు చెలువ, మోము గని పొంగెననురాగ ♦ మునశివుండు.

నలిగి దుప్పటి యున్నట్టి ♦ నడిమిచార, మగలి మేఖల పడియున్న ♦ యట్టి మఱియు
లత్తుకరసంపుఁబసచిహ్న ♦ లత్తినట్టి, పాన్పు వీడఁడు హరుఁడు ప్ర ♦ భాత మైన. 89

మోదమును బెంచుప్రియసతీ ♦ ముఖరసంబు, విడువక యహర్నిశంబు సే ♦ వించు భవుఁడు
దర్శనార్థుల కియ్యండు ♦ దర్శనంబు, విజయుచే విన్నపము చేసి ♦ వేచియున్న. 90

రేపవల్లొకగతి నటఁ ♦ బ్రియనుగూడి, యేకరాత్రిగ నిరువదే ♦ నేండ్లు శివుఁడు
గడపియు రతమ్మునను దృప్తిఁ ♦ బడయఁ డయ్యె, వసధిజలములబడబాగ్ని ♦ తనియనట్లు.

గద్య.

ఇది శ్రీపరమేశ్వరకరుణాఫలిత లలితకవితాకలిత శ్రీరామలక్ష్మాంబా
బుచ్చివేంకయామాత్యతనూజాత సకలసజ్జనవిధేయ ఆదిపూడి
సోమనాథనామధేయప్రణీతం బయినయాంధ్రకుమార
సంభవమునందు నుమారతవర్ణనం
బనునష్టమాశ్వాసము.



# శుద్ధపత్రిక.



| ఆశ్వాసము. | పద్యము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 23 | బుష్న | బుష్ప |
| 5 | 80 | ఖాదలు | మసలు |
| ,, | 81 | బితఁడె | బతఁడె |
| ,, | ,, | నితనికి | నతనికి |
| 7 | 4 | పిల్లలందును | పిల్లలండుమ |

# ఆంధ్రరఘువంశముపై బుధజనాభిప్రాయములు.

## I. బ్రహ్మశ్రీ కూచి నరసింహముగారు B A.

పద్యములు మనోహరములుగను నిర్దోషములుగను సుబోధములుగ నున్నవి. **

కవిపుంగవుఁ డగుకాళిదాసు కవితాపాయసము, సముచితపాత్రమునఁ దెలుఁగు వారికి విం దిడి వారికృతజ్ఞతావందనములకుఁ బాత్రు లైనారు.

ఇది పాఠశాలలలోఁ బఠనీయగ్రంథముగ నేర్పఱుచుట కన్నివిధముల ననువై యున్నదని నాయభిప్రాయము.

## II. బ్రహ్మశ్రీ పురాణం నాగభూషణంగారు M.A.B.L.

తమయాంధ్రరఘువంశము మిగులరమణీయ మగుకావ్యము. * * మూలమం దుండురసమునకు, గాంభీర్యమునకు భంగము కలగకుండ తాము సులభశైలిని దెనిఁగించఁ గలిగితిరి. * * *

## III. బ్రహ్మశ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు.

* * * *

మీయాంధ్రరఘువంశము మిక్కిలి మనోహరముగను సలక్షణముగను మూలానుసారముగను నున్నది. * * *

## IV. బ్రహ్మశ్రీ దుగ్గిరాల వెంకటసూర్యప్రకాశరావుగారు.

* * *

సంస్కృతజ్ఞానలవము గల్గి, తెలుగుకావ్యసారము గ్రహింపఁగలవారెల్లరును మీ భాషాంతరీకరణమున మూలమునందలిసారము, భావము, గంభీరము, మార్దవము లోనగున వాకొటికైన లోఁలగిపోక కడురమ్యముగను హృద్యముగను మీకావ్యమురచింపఁబడె నని నిష్కల్మషముగఁ బల్కక తీరదు. తేటగీతలలో మూలమునందలిరసమునంతయు నిముడ్పఁజాలినమీపజ్ఞ స్తవనీయము. * * *

**V.** బ్రహ్మశ్రీ రామకృష్ణకవులు.

మీయాంధ్రరఘువంశముం జదివినారము. మృదుమధురశైలితో మూలానుసారముగా నొప్పుచున్నది. * *



**VI.** బ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బారావుగారు.

* * * *

మూలమునకు సరిగాను ఇంపుగాను జక్కఁగా నున్నది. శైలి సరళమై యున్నది. * * *



**VII.** బ్రహ్మశ్రీ నడకుదుటి వీరరాజుగారు.

* * * *

ఈగ్రంథమునందలి మీపద్యములశైలి మిగుల ధారాళముగను, మృదువుగను, రసవంతముగను, మనోహరముగను నున్నది. మఱియు సంస్కృతమున శ్లోకము లెట్లు మృదుమధురముగ నున్నవో తెలుఁగున మీపద్యములును అట్లున్నవి. ఆంధ్రీకరణము కడవఱకు మూలమున కన్యూనానతిరిక్తముగ నొప్పారు చున్నది. * *



**VIII.** బ్రహ్మశ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

* * * * *

అన్నివిధముల మీయాంధ్రీకరణము మూలానుసారమై యాంధ్రవ్యాఖ్యవలెఁ దనరుచు సహృదయహృదయాహ్లాదకరంబై యలరారుచున్నది. * *



**IX.** బ్రహ్మశ్రీ జయంతి రామయ్యగారు.

అయ్యా! తమ యాంధ్రరఘువంశము చదివినాఁడను. భావములు మూలానుసారముగను కవిత్వము సరసముగను సలక్షణముగను నున్నవని నాయభిప్రాయము. బహుభంగుల మీగ్రంథము విద్వదాదరణీయమనుటకు సందేహము లేదు.

# గీతాంజలిపై బుధజనాభిప్రాయము.

బ్రహ్మశ్రీ వేమూరి రామకృష్ణరావుగారు. M.A.L.T.

అయ్యా!

ఆసియాఖండమున కెల్ల నాస్థానకవీశ్వరుఁడని వినుతిఁగాంచిన రవీంద్రనాథుని "గీతాంజలి" నేఁటికే విమర్శనీయావస్థ నతిక్రమించిన యమూల్యగ్రంథము. అనువాదమూలమున నాపెన్నిధి నాంధ్రలోకమునకుఁ గూడ లభింపఁ జేసినమహోపకార మెంతయు స్తవనీయమును గృతజ్ఞతాపాత్రమును గాని వేఱొండు గాదు. అట్టి సదాలోచన నిజముగా దివ్యోద్బోధితము. మూలకవియొక్క గభీరభావకల్పనాశక్తియు, సిద్ధుని యాంతరదృష్టిమహిమయు, భక్తుని వివిధరసనిలయానుభవమును, మూలభాషనుండి యన్యభాషాధారమున మఱి మూఁడవభాషలోనికి వ్యక్తీకరింప సాధ్యమైనంత మీకృషి మాభాగ్యముకొలఁది నెఱవేర్పఁ గలిగితిరి. లలితపదములలోఁ దేటతెల్లముగ సామాన్యగ్రాహ్యమగురచనలయందు మీకుఁ గలయనల్పప్రజ్ఞ నెఱిఁగినవారికి మఱియొక యానందదాయకమైనప్రమాణము నొసంగితిరి. తేటగీతలే గాని జీవితమునకంతకుఁ జాలినతత్త్వము, తృష్ణ, తృప్తి! ధర్మపరాయణులకెల్ల నివ్వాని నొడఁగూర్చినందునకు వందనము లర్పించు మిత్రుఁడు.

# రామమోహననాటకముపై బుధజనాభిప్రాయము.

బ్రహ్మశ్రీ వి. పి. రాజుగారు B.A.

మీరు దయాపూర్వకముగా నొసంగిన రామమోహననాటకము చదివి సంతోషించితిని. స్త్రీలకు, బాలురకు, పాండిత్యములేనిపామరులకు సహితము బోధపడులాగున మృదుశైలిని భక్తిరసపూరితముగ ఈచిన్నగ్రంథమురచించి భక్తులకృతజ్ఞతకు పాత్రులైతిరి. గొప్పనాటకములకు గావలసినలక్షణములు దీనియందు గొన్ని లోపించియుండవచ్చును. కాని రామమోహనరాయలవా రుపన్యసించిన తత్వములను పరస్పరసంభాషణరూపమున చక్కగ ముఖ్యాంశములను తేటపరిచి తియ్యనిపలుకులచే మనోహరము గావించితిరి. లోకము భిన్నము, సిద్ధాంతములు భిన్నములు. వీటినిగుఱించి వ్రాసినగ్రంథములు స్థిరములుగావు. కాని భక్తిరసగర్భితములైన పుస్తకములు మాత్రము స్థిరములైయుండును. భక్తిరసముతో నిండిన ఈగ్రంథము తెలుగుభాషను చిరకాలము అలంకరించునని నమ్ముచున్నాను.

ఆదిపూడి సోమనాథరాయప్రణీతములైన గ్రంథములు.



1 ఆంధ్రరఘువంశము 1600 పద్యములు కేలికోబైండు. రు 1 0 0

కాళిదాసకవిసార్వభౌముని రఘువంశమునకు సరియైన తెనుఁగు. సరళము, సరసము, సలక్షణమునని యందఱు మెచ్చుకొనుచున్నారు. సంస్కృతసమేతము.

2 గీతాంజలి ... ... 0 8 0

ప్రస్తుత మాసియాకవిచక్రవర్తియను బిరుదమువడసిన శ్రీయుత రవీంద్రనాథ ఠాకూరుగారిచే నాంగ్లమున వ్రాయఁబడి 1,20,000 రూప్యములబహుమతినొందిన గీతాంజలికి సరియైన తెనుఁగుపద్యములు.

3 రామమోహననాటకము. మనోహరములైనపద్యములు. 0 6 0

వర్తమానయుగపురుషుఁడని ప్రఖ్యాతివడసిన శ్రీరాజారామమోహనరాయలపవిత్రజీవితము. దృశ్యరూపము. భక్తిరసప్రధానము.

4 సర్వమాన్యశతకము. ... ... ఉచితము.

నవీనపద్ధతిని కేవలము భక్తిరసప్రధానముగ వ్రాయఁబడినది.

5 ఆంధ్రకుమారసంభవము. ప్రథమభాగము 600 పద్యములు. 0 8 0

కాళిదాసకవిసార్వభౌముని కుమారసంభవమునకు సరియైన తెనుఁగు.

6 లోకపావనశతకము. భక్తిరసప్రధానము ద్వితీయముద్రణం 0 1 0

7 కృష్ణదేవరాయచరిత్ర. వీరరసప్రధానపద్యకావ్యము 0 8 0

ద్వితీయముద్రణము. చైత్రమాసాంతమున సిద్ధమగును.

8 విజయేంద్రవిజయము. నూతనప్రబంధము ద్వితీయముద్రణము 0 8 0

వైశాఖాంతమున సిద్ధమగును.

9 జపానుచరిత్ర. వచనము జ్యేష్ఠాంతమున సిద్ధమగును. డిటో. 0 6 0

10 శ్రీదయానందస్వాములచరిత్ర. వచనము డిటో. 0 3 0

ఆషాఢాంతమున సిద్ధమగును.

11 ఆంధ్రకుమారసంభవము. ద్వితీయభాగము 500 పద్యములు 0 8 0

శ్రావణాంతమున సిద్ధమగును.

12 ఆంధ్రమేఘసందేశము. విజయదశమికి సిద్ధమగును. 0 4 0

13 సత్యార్థప్రకాశిక. అమూల్యగ్రంథరాజము . 3 0 0

రమారమి 1000 పుటలు. ఆనందసంవత్సరాంతమునకు సిద్ధమగును.

వలయువారు గోదావరిజిల్లా పిఠాపురముననున్న గ్రంథకర్తగారికి వ్రాసినఁ బడయఁగలరు.